# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రిక



4 అణాలు
30-12-'53

ANDHRA PATRIKA ILLUSTRATED WEEK



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి





































సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 17
30-12-53

విజయ మార్గశీర్ష బహుళ దశమి బుధవారం

మహాబలిపురంలోని వెన్నముద్ద

ఫోటో :— వి. పుల్లేశ్వర్, విజయవాడ.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :— సారథీవారి
'అంతా మనవాళ్లే'లో
జమున








వనజభవుండు నెన్నొసట
వ్రాసిన సొమ్ము ఘనంబొ కొంచెమో
విను, మరుభూమి కేగిన
లభించును; మేరువు జేరబోయినన్
ధన మధికంబు రాదు; - కడు
దైన్యము మాను ధనాఢ్యులందు; - న
వ్యనవనిధి, నూత, దుల్యముగ
వారి గ్రహించు ఘటంబు నూడుమా.

తా॥ బ్రహ్మ నొసటిపై వ్రాసిన ప్రకారము ధనము ఎక్కువగాగాని, కొంచెముగాగాని ఎడారి భూములలోనికి వెళ్లినను లభించగలదు. బంగారు కొండయైన మేరుపర్వతమును చేరినప్పటికీ ధనం అధికంగా రాదు. కనుక ధనవంతులజూచి దీనుడవై ఉండకుము. కుండను తీసికొనివెళ్లి సముద్రములో ముంచినను బావిలో ముంచినను ఆ కుండలో పట్టునటువంటి నీళ్లు సమప్రమాణముగానే ఉంటాయి.

నొసటిమీద బ్రహ్మవ్రాసినవ్రాత ఒకటి ఉన్నదని అంటారు. కాని, ఆ వ్రాత ఏమిటో చదివి, పూర్వహోండు వ్రాతలో (సంక్షిప్తలేఖనంలో) వ్రాసినదానిని లాంగుహేండులోకి (సవ్య లేఖనంలోకి) మార్చి చదివినట్లుగావివరించి ఎవరైనా చెప్పగల్గినట్లయితే ఆ బ్రహ్మవ్రాత ఏమిటో చెప్పగల్గినవారికి నిజంగా సరస్వతీ ప్రసన్నం అయినదనే చెప్పవచ్చు. దేవనాగరలిపి ఏర్పడక పూర్వం బ్రాహ్మీలిపి అనేది అమలులో ఉండేది. దానిని బ్రాహ్మీలిపి (సరస్వతి వ్రాత) అన్నారుగాని, బ్రహ్మవ్రాత అని దానికి నామకరణం చేయలేదు. ఏమైనప్పటికీ, యీరోజులలోకూడా ఎవడైనా తల తిక్కగొలుసుకట్టువ్రాత వ్రాసి మొదటి నుంచి చివరవరకూ "లులులూలూ" అనే ఏకాక్షర కవిత్వం వ్రాసినట్లయితే, "నాయనా! యిదంతా బ్రహ్మవ్రాతగా ఉందిగాని, నీవు వ్రాసినదేమిటో నీవే చదివి వినిపించవోయి!"అంటారు. బ్రహ్మవ్రాసిన వ్రాత ఏమిటో, "బ్రహ్మకైన తెలుసునో తెలియదో" అని చెప్పవలసి వస్తుంది. కర్మఫలమును అనుభవించడం అనేది కమలభవునకైనా తప్పదనేయెడల, ఏ కర్మఫలమును బ్రహ్మ అనుభవించవలసియున్నాడో అది స్పష్టంగా బ్రహ్మ నొసటిమీద బహుశః నాలుగు ముఖాలమీద ఒక్కటే స్టాంపు ముద్ర కొట్టినట్లుగా, నాలుగునకళ్లు పైపు కొట్టినట్లుగా లిఖింపబడియుండవచ్చును. కనుక 'బ్రహ్మవ్రాత' అనేది బ్రహ్మ యొక్క ముఖముమీద వ్రాయబడిన వ్రాతకూడా కావచ్చు. చాలా పెద్ద అక్షరాలతో వార్తా పత్రికల పుటల నెత్తిమీద ప్రతిదినమూ ముఖ్యమైన ప్రధానమైన వార్తలు ముద్రింపబడుతూ ఉంటాయి. రుద్రాక్షలంత అక్షరాలలో వ్రాయబడిన విషయములను పత్రికాపాఠకులోకము పత్రికను తెరువగానే చదివి తీరగలదు. వాటినే "శీర్షికలు" అంటారు *Head-lines* అని ఇంగ్లీషులో అంటారు. *Head* "హెడ్" అంటే తల. *lines* లైన్సు అంటే గీతలు. కనుక యీ కాలంలో లోకవార్తలు పరిశీలించేవా ళ్ళందరూ శ్రద్ధగా గమనించెడి తలవ్రాతలని చెప్పవలసి వస్తుంది.

ఈ తలవ్రాతలు కూడా ఒక్క విధంగా స్థిరంగా ఉన్నట్లు కన్పించవు. ఒకరోజున "ఆంధ్రా హైకోర్టు గుంటూరులోనే" అని ఉన్నట్లయితే, ఇంకోరోజు పత్రిక నెత్తిమీద, "ఆంధ్రా హైకోర్టు విశాఖపట్నంలోనే" అని ఉండవచ్చు. చిట్టచివరకు అదీ యిదీ కాకుండా "ఆంధ్రా హైకోర్టు అనంతపురంలోనే" కావచ్చు. అనంతపురంలోనికో, ఎవరికీ అందుబాటులో లేని ఏ అంతఃపురంలోనికో అది చేరిపోవచ్చు. ఏమైతేనేమి? ఈ ఆంధ్ర తలవ్రాతలు నిలకడ లేక తలక్రిందులై తలక్రిందు వ్రాత లవుతున్నాయి.

ఉర్దూభాష లిపి తలక్రింది వ్రాతగానే ఉంటుంది. తెనుగుభాషగాని, హిందీగాని

ఎడమనుంచి కుడివైపుకు వ్రాసినట్లయితే, ఉర్దూభాషను కుడినుంచి ఎడమవైపుకు వ్రాయాలి; పుస్తకం చివరినుంచి మొదటికి చదువుకోవాలి. నైజాము రాష్ట్రంలో తెనుగువాళ్ళు చాలామంది చిరకాలావాసులుగా ఉన్నారు. కాని, వారిలో చాలామంది తెనుగు మాట్లాడుతూఉంటే, ఉర్దూ మాటలూ, పారసీమాటలూ విరివిగాదొర్లుతూ ఉంటాయి. ఈనాడు వారు మాట్లాడేది అంతా పక్కా తెనుగు కాకపోయినా, ప్రతాపరుద్రుని కాలంనుంచీ, ఇంకా అంతకు పూర్వంనుంచీ, వారు అప్రతీప ప్రతాపంతో ఆంధ్రపతాకముద్రికను తమ హృదయఫలకముల ముద్రించి, ఆంధ్ర జాతిలో జాతిరత్నములు వలసి మెరిసిన ఇరవొనర్చిరి తెలింగాణాను. ఈ తెలింగాణా కూడా అభినవాంధ్ర రాష్ట్రములో యింకా లీనం కావలసియున్నది. అప్పుడు హైద్రాబాద్ (భాగ్యనగరం) మన విశాలాంధ్ర రాష్ట్రమునకు రాజధానీనగరం కాగలదనిన్నీ, మన భావి భాగ్యోదయమున కది తగిన రాజధానీ నగరమనిన్నీ, ఆంధ్ర నాయకమణి గుణిస్తోంది. ఆంధ్రలోకవాణి వీణ వాయిస్తోంది. మహమ్మదీయ ప్రభువుయొక్క ఏలుబడి క్రింద చిరకాలంగా ఉంటూఉండిన యీ నిజాము రాష్ట్రములోని తెలింగాణా ఆంధ్ర రాష్ట్రములో చేరినపిమ్మట, యీ విస్తృత రాష్ట్రమునకు "విశాలాంధ్ర రాష్ట్రము" అని నామకరణం చేయవలెనన్నారు కాని, దానికే "మహా తెలింగాణా" యని ఎందుకు నామకరణం చేయరాదు? అని వాదించే తర్క పండితులు మనలో లేకపోలేదు. అయినా, పుట్టబోయే బిడ్డ "రామలింగడా? సోమలింగడా?" అని వివాదం యిప్పటినుంచీ ఎందుకని సమాధానం చెప్పవచ్చు. మనది త్రిలింగరాజ్యమనియు తెలింగాణా యనియు అంగీకరించిన యెడలనే "రామలింగడా? సోమలింగడా?" అనే ద్విలింగ వివాదం వస్తుంది. కాని, మన తలవ్రాత ఎట్లా ఉందో? కాలగర్భంలో ఉన్నది ఏ శిశువో? తెలియనప్పుడు, విశాలాంధ్రం అనేది పండు కావచ్చు - కాయ కావచ్చు. కాలగర్భంలో ఉన్నది మొగబిడ్డ కావచ్చు. ఆడబిడ్డ కావచ్చు. అందువల్ల కాలగర్భం ఫలించి, ఆ కాలదేవత సకాలంలో ప్రసవించేవరకు మనం చేసే నిర్ణయములు తలక్రిందులయ్యే సూచనలు లేవు. అంతవరకూ తాత్కాలిక రాజధాని, తాత్కాలిక హైకోర్టు, తాత్కాలిక ప్రభుత్వం, తాత్కాలిక తత్వం ఆంధ్ర తలవ్రాతగా ఉండవచ్చు. తెలింగాణా చేరిన తర్వాత యిది తలక్రిందులు వ్రాతకావచ్చు. అంతవరకూ మనము తెలివిగా తెలింగాణాకై తలకిందులుగా తపస్సు చేస్తూ ఉండవచ్చు.

చేయవలసినకృషి, సాగింపలసిన ఉద్యమం, నిర్భయంగా సాగించవలసిందే కృషి చేస్తేనేగాని దేశదుర్భిక్షం తొలగిపోదన్నారు. జపంచేస్తేనేగాని పాతకం తొలగిపోదన్నారు.

"కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకం
మౌనేన కలహో నాస్తి
నాస్తి జాగరతోభయం"

కృషివల్ల దుర్భిక్షం పోతుంది. జపించడంవల్ల పాపకర్మ దోషం పోతుంది. మౌనంవల్ల కలహం పోతుంది. జాగరూకతతో ఉండడంవల్ల భయం పోతుంది. ఈ నీతిరీతి ఆంధ్రజాతి తలపోసి విశాలాంధ్రకై కృషి చేస్తోంది. "విశాలాంధ్ర" "విశాలాంధ్ర" యని జపిస్తోంది అందువల్ల కొందరాంధ్రనాయక శిఖామణులు రాజధానీనగర వాద ప్రతివాదములలో మౌనముద్ర వహించి కలహించకుండా కలిసి మెలసి కాలం గడుపుచున్నారు "మౌనేన కలహంనాస్తి" అన్నారు. ఏమైనప్పటికీ, అన్ని పక్షాలవారు ఎవరిమట్టుకు వారు మెలకువగానే ఉన్నారు. "నాస్తి జాగరతో భయం". జాగ్రత్తగా ఉంటే ఏ భయమూ లేదు.

అటువంటిసందర్భంలో, ఎటువంటి పాపకర్మదోషమైనా జపమువల్ల పోగలదని తపస్సంపన్నులు ప్రత్యక్షప్రమాణంగా ఋజువుచేసియుండినసందర్భంలో, ఆంధ్రుల నిరంతరకృషివల్లనూ పొట్టి శ్రీరామ యోగివంటి తపస్సంపన్నుని తపశ్శక్తివల్లనూ మనకు ఆంధ్రరాష్ట్రం సిద్ధించినదని సిద్ధాంతీకరించుచున్న సందర్భంలో, మన తలవ్రాత ఎట్లా ఉన్నదో అనే భయం మనకెందుకు ఉండాలి?

"హరిణాపి హరేణాపి
బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితా రేఖా
పరిమార్ష్టుం నశక్యతే"

అని ఎందుకు వాదించాలి? విష్ణువుగాని, శివుడుగాని, బ్రహ్మగాని, దేవతలుగాని యెవరైనను నుదుట వ్రాసిన వ్రాతను పోగొట్టలేరు. తపస్సు చేయడంవల్ల పాతకం పోతుంది అనేటట్లయితే, మన జాతకం మారిపోతుంది అని అంగీకరించాలి. మన తలవ్రాత తలక్రిందులు వ్రాత అవుతుంది అని అంగీకరించాలి ఈమాట స్థిరసిద్ధాంతమై సిరాక్షరం అయినట్లయితే, బ్రహ్మ వ్రాసిన అక్షరాలన్నీ క్షరాలు కావలసిందే. తపస్సంపన్నులు మంత్రాక్షతలు జల్లితే, మంత్రాక్షరాలు క్షరాలవుతాయి. యుగధర్మం పోయి ధర్మయుగం వస్తుంది. హింసాయుగం పోయి అహింసాయుగం వస్తుంది. కలికాలంపోయి చక్రికాలం వచ్చి కాలచక్రం తలక్రిందులవుతుంది.

కాలానికి, కాలధర్మానికి మానవుడు కట్టుబడి జీవించి కాలధర్మం కావలసిందేనా? ఈ ధర్మమీమాంసకే యోగీశ్వరుడైనవాడూ, యోగేశ్వరుడైనవాడూ జవాబు చెప్పి బ్రహ్మవ్రాసిన గీతలకంటె, భగవద్గీత గొప్పదని చూపించాడు.

కర్మ చెయ్యడమే ధర్మం అన్నాడు. నీవు కర్మ చేసినంతమాత్రంచేతనే అనగా నీవు ఒక పని చేశావనెడి కారణమునే, లేదా, నీవు ఒక కృషి చేసినావనే యొక్క ఏకైక కారణంవల్లనే, సదరు కృషివల్ల నీవు కోరిన ఫలితం లభిస్తుందని అనుకోవద్దు. అది ఫలించడానికి సాధనభూతములైన యితర సందర్భ కారణములు, (నీకు తెలియనివి) నీ తలవెంట్రుకలన్ని ఉన్నాయి. పొలం దున్నుతావు, విత్తనాలు జల్లుతావు. పొలానికి నీరు పెడ్తావు. కలుపు తీస్తావు. వేయికళ్ళతో పైరును కనిపెట్ట చూస్తావు. ఇదంతా నీ కృషి - కాని, ఆ పొలంలో అంతమాత్రంచేతనే నీవు కోరినపంట పండడం సంభవింపదు సూర్యుని ఎండవల్ల వెల్తురు, వేడి సవ్యంగాఉండాలి. వర్షాలు, తుపాను, గాలులు, మిడుతల దండ్లు, వరదలు, భూగర్భంలోని పరిస్థితులు యింకా ఎన్నో ఎన్నో అగమ్యగోచర కారణాలు, జ్యోతిషానికీ, నీపరిమిత భౌతికశాస్త్ర విజ్ఞానానికీ అందని అచింత్య, అనివార్య, అసాధారణ, అమోఘ, అస్థిర, ఆకస్మిక అనేక సందర్భ కారణాలు ఉంటాయి. ఆ కారణాలకు ఏవో కారణాలుంటాయి. అదంతా మన దృష్టికి అందని అదృష్ట విషయం. ఈ అదృష్ట కారణాలవలనూ, మనం చేసిన కృషివల్లనూ, ఫలితం అనేది ఒక రేవుకు చేరుతుంది. బలకట్టు తెప్పను మనం ఒకవైపుకు లాగితే, కాలువలోని ప్రవాహం మరొకవైపుకు ఆ

# ★ కాలక్షేపం ★

తెప్పను తోస్తూఉంటే, చిట్టచివరకు ఈ రెండు శక్తుల సంయుక్త ప్రభావం మూలంగా, అనుకొన్న రేవుకు గాకుండా మరొక రేవుకు బల్లకట్టు చేరుకుంటుంది. అదే విధంగా దృష్ట కారణాలవల్లనూ, అదృష్ట (మనకు గోచరించని) కారణాలవల్లనూ, రెండు విధములుగా యీడ్వబడినటువంటి ఫలిత పర్యవసాన సారాంశము ఏదో ఒక రేవుకు చేరుతుంది. కనుక, కృషి చేసినంతమాత్రమున, నీవు చేసిన కృషికి కోరిన ఫలితం ఎక్కుములు గుణించినట్లుగా లెక్కకట్టి, నోటిలో వేలు పెట్టుకొని కూర్చుండవద్దు. ఫలితం అనేది నీ కృషి మీదనే ఆధారపడి ఉన్నదనిన్నీ, యితర సందర్భములుగాని అసందర్భములుగాని ఏమీ ఉండవనిన్నీ ఊహించుకుంటూ నువ్వు గింజసామెతగా నువ్వులపంటను లెక్కించుకొనేవాడు నవ్వులపాలవుతాడు.

అనగా అనగా ఒక రాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురూ ఏడు చేపలు తెచ్చి ఎండలో ఎండబెట్టితే, అందులో ఒక చేప ఎండలేదు. "చేపా! చేపా! ఎందుకు ఎండలేదు?" అని ప్రశ్నించగా ప్రశ్నించగా మూలకారణం ఎక్కడ ఉన్నదో పూర్తిగా విచారించినవాడెవడు? "నా బంగారు కన్నములో వేలు పెట్టితే నేను కుట్టనా?" అని చివరకొక చీమ జవాబు చెప్పింది. అంతటితో ఆ కథ ముగించి పిల్లలను జోకొట్టి నిద్రపుచ్చుచున్నాము. కాని ఆ కథనే పెద్దవాళ్లకు చెప్పడం ప్రారంభించితే, చీమ చెప్పిన జవాబుతో ధీమంతుడు ఊరుకొనడు. చీమలున్న కన్నములో బిడ్డడు వేలు ఎందుకు పెట్టవలసివచ్చింది. ఆ బిడ్డను కుట్టవలెననే సంకల్పం చీమకు ఎందుకు కలుగవలసివచ్చింది? ఇదే విధివైపరీత్యం. ఇదే దైవనిర్ణయం. ఇదే ఎవడికీ అర్థంకాని, బ్రహ్మవ్రాత. ఆ బ్రహ్మవ్రాత ఎందుచేత అట్లా వ్రాయడమైనదో, బ్రహ్మకైన తెలుసునో తెలియదో. ఇది మనకు అగోచరమైన విషయం. కన్పించనిది అదృష్టం (దృష్టం కానిది). కనుక "మూలకారణం బెయ్యది?" అనే సమస్యకు సమాధానం చెప్పగల్గినవాడెవడో, అటువంటి వాడు మాత్రమే తన కృషికి, తన కర్మకు ఫలానా ఫలితం ఖండితంగా లభిస్తుందని ఢంకామీద దెబ్బకొట్టినట్లుగా చెప్పగలడు. తాను వ్యాపారంచేస్తే ఎంత లాభం లభిస్తుందో చెప్పగలడు. తన జీవితం ముగిసే సరికి తనకెంత నిల్వ ధనం బ్యాంకులో ఉంటుందో చెప్పగలడు.

అయినా, యిదంతా చెప్పగల్గినందువల్ల కలిగిన ప్రయోజనం, లాభమేమిటి? తన పంట ఎంత పండుతుందనే గణన మనసంతో సంతతధాన్య ధ్యాన తత్పరుడైపోయినట్లయితే, ఆ పంటలోనే లీనమైపోతాడు. ఆ పంటకు వేసే పెంటలోనే లీనమైపోతాడు. "పంటమూల మిదం జగత్" అంటాడు లేదా "పెంటమూల మిదం జగత్" అంటాడు. వ్యవసాయదారుడు వ్యవసాయంతోనే పుణ్యం, ముక్తి, మోక్షం, స్వర్గం, సర్వస్వం ఉన్నాయనే తత్వంలోకి దిగుతాడు. వర్తకుడు "ధనమూల మిదం జగత్" అంటాడు. రాజకీయతంత్ర పరతంత్రుడైన వాడు "పార్టీమూల మిదంజగత్"అంటాడు. లేదా"వోటుమూల మిదంజగత్"అంటాడు. జీర్ణకోశం ఒక్కటి మాత్రమే బాగుపడితే చాలదు. పైత్యకోశం ఒక్కటిమాత్రమే సవ్యంగా పనిచేస్తే చాలదు. గుండెకాయ ఒక్కటే దండిగాఉంటే చాలదు, శ్వాసకోశం లవలేశం లోపంలేకుండా పనిచేస్తే చాలునను విశ్వాసం ఉంటే చాలదు—ఈ శరీరానికి సర్వాంగ, సర్వేంద్రియ సర్వ సమగ్ర సర్వతోముఖ సమష్టి సమస్థాయిగల హాయి ఏర్పడవలెనంటే, శరీరాన్నీ మనస్సునూ సమానమైన స్థిమితంలో ఉంచగల బాధ్యత "నేను వహిస్తాను" అని శ్రీకృష్ణుడు గ్యారంటీ యిచ్చాడు భగవద్గీతలలో—"యోగక్షేమం వహామ్యహం" అన్నాడు. నన్ను నమ్మకొని, నన్ను గూర్చి నీవు సదా ధ్యానం చేస్తూ, "కృష్ణార్పణం" అని త్రికరణశుద్ధిగా స్మరించి, నీవుచేసే కృషి అంతా నాకే నివేదన చెయ్యి అన్నాడు. అప్పుడు నీ మనస్సు ఆందోళన పడకుండా స్థిమితంగా ఉంటుంది. నీవు చేసే కృషికి ఎన్ని విఘ్నాలు వచ్చినా, నీ మనస్సు భగ్నంకాదు. నీ ఆరోగ్యం చెడదు. నీ ఆరోగ్యం చెడినా, నీ మనస్సును తమస్సు ఆవరించక, అది కాల్చిన బంగారు కణికలాగున "తప్తకాంచన సన్నిభం" అయి ప్రకాశిస్తూ ఉంటుంది. నీ మనస్సుకు దైన్యం అనేది ఉండదు. నాకు అది లేదు ఇది లేదు అని ఏడుస్తూఉండడం అలవాటు చేసికోవద్దు అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. అంతకు తప్ప మరేమీ లేదు భగవద్గీతలో—కర్మఫలంకోసం తపించవద్దన్నాడు. మన కర్మఫలంకోసం మనం తపించినకొద్దీ, ఆతాపం, ఆవేడి, ఆ మంట, మనలనే తినివేస్తుంది. మన మనోదార్ఢ్యాన్ని తినివేస్తుంది. మన ఆత్మధైర్యాన్ని హరించి వేస్తుంది.

కాని, కర్మచేయడంలో భగవద్ధ్యానం చేస్తూ ఆ కర్మను అంతా భగవత్సేవగా, భగవత్కైంకర్యంగా భావించి విమోచర "కృష్ణార్పణం" అని చేసినట్లయితే ఆ కర్మకోసం మనం నిజమైన తపస్సు చేసినట్లవుతుంది. అటువంటి కర్మవల్ల, అటువంటి తపస్సువల్ల మన ఆత్మతేజస్సు అంతకంతకు అధికమవుతుంది. అంటే అర్థమేమిటి? మనలో అంటుకొనియున్న పూర్వజన్మవాసనలూ, పూర్వజన్మకర్మవాసనలూ, పాత పాతకముల మురికీ అంతా హరించిపోతుంది. రేవుకు వెళ్లివచ్చిన కోటులాగున రవికోటి తేజంతో ప్రకాశిస్తుంది.

నీకు ప్రాప్తించినదేదో ప్రాప్తిస్తుంది. పొరుగింటివాని ఆవు పాడుగు లావు అని మనము ఏడిస్తే అది మనకొక దుగ్ధయేగాని, ఆ దుగ్ధములో ఒక్క చుక్కయినా మన డొక్కలో పడదు. మనకు మిగిలేది మన దుగ్ధమాత్రమే.

అంతేకాదు. తినకు ఉన్నదని మిన్ను మన్ను కానక తిరిగినవాడుకూడా, ఉన్నది సున్నయగునేమో యనే విచారంతోనే సదా సంచరిస్తూ ఉంటాడు. ఇంట్లో ఇనుప పెట్టె ఉన్నవానికి, గోడవెనుక కునపం చప్పుడైతే, గుండెలలో పొడిచినట్లుంటుంది. ఇనప పెట్టెకంటె బ్యాంకుగట్టి—బ్యాంకులో డబ్బు దాచినతర్వాత బ్యాంకు దివాలా అయితే మనిషి దివానా అవుతాడు.

పూర్వము ఆర్బత్నాట్ బ్యాంకులో డబ్బుదాచుకొన్న ధనికుడు ధన్యుడని మాన్యుడని అనిపించుకొనేవాడు. రంగారెడ్డి అనే పెద్ద ఆసామీ రమారమి పదివేలరూపాయిల మొత్తమును పరాయి ఊరినుంచి మద్రాసుకు తీసికొని వచ్చాడు. ఎందుకు? ఆర్బత్నాట్ బ్యాంకులో తన ఖాతాలో జమకట్టడంకోసం. బ్యాంకుకు వచ్చిన తన సాటి సాహుకార్లందరూ తాము తెచ్చిన పెద్దపెద్ద మొత్తములను సమయానికి వచ్చి బ్యాంకుకు చెల్లించి బ్యాంకులో దాచుకొని "ధన్యోస్మి! ధన్యోస్మి!" అనుకుంటూ ఖాళీ సంచులను చంకలను బెట్టి, సరససల్లాపాలు ఆడుకుంటున్నారు. పొరుగూరునుంచి ఆదరాబాదరా పరుగెత్తుకొనివచ్చిన రంగారెడ్డి పదివేల రూపాయల రొక్కంతో బ్యాంకుకు వచ్చేసరికి బ్యాంకులో పైకం పుచ్చుకొనే టైము అయిపోయింది. టైము అయిపోయి ఒక్క నిమిషం దాటింది. 'ఈ పదివేల రూపాయిల రొక్కం యీరాత్రి నేను నా బసకు తీసికొనిపోయి నిద్రపోగలనా? బాబూ! నాయందు కరుణించి, కటాక్షించి, దయచేసి, అనుగ్రహించి, గ్రహించి, స్వీకరించి నన్ను ధన్యుని చేయండి!' అని బ్యాంకు

(56-వ పేజీ చూడండి)

# జాతి సంగీతం

అవ్యవస్థ. అది మన అవస్థ.

జీవితం గారడీలాగ, పేరడీలాగ కనిపించే యీ రోజుల్లో దేన్ని గురించీ తాపీగా ఆలోచించడానికి వీల్లేకపోతోంది. నిన్నటి సత్యం నేడసత్యం. ఏది ముట్టుకున్నా మట్టి. సముద్రపునీళ్లలో నుంచుంటే కాళ్లకింది యిసక తనకు తానే దొలుచుకుపోయినట్టు, జీవితంలో ఏ సిద్ధాంతం, ఏ పట్టుకొమ్మ, ఏ గట్టినేలా విశ్వసనీయమైనది కనిపించడంలేదు.

నిరుద్యోగం, అనారోగ్యం, నిరాశ, నిస్పృహ మామూలుమనిషిని కొంచెంకొంచెమే జుర్రుకుంటున్నాయి. ఎవణ్ణి చూసినా ఋణధ్రువంలాగ కనిపిస్తున్నాడు. ముఖ్యంగా విద్యావంతులైన యువకుల ఆలోచనలు ఋణధ్రువం కేసి ఆకర్షించబడుతున్నాయి.

ప్రపంచమే ఒక కార్టూన్‌లాగ కనిపిస్తోంది.

నిన్న కాకలీగీతాలు పాడిన కవులు నేడు ఆకలిగీతాలు తిని బతుకుతున్నారు.

దేన్ని గురించీ తీవ్రంగా, సూటిగా, తాపీగా ఆలోచించడం ఎలా? ఆలోచించకపోతే ఎలా?

జీవిత కురుక్షేత్రంలో సందేహ సందోహ రాహుగ్రస్తుడైన మానవుడికి, గుండెమంటలు చల్లార్చే అభినవ భగవద్గీత ఎక్కడ వుంది?

నిండు కొలువులో ద్రౌపది పరాభవించబడినట్టు, ప్రతివాడి పైరవీటు జీవితం రచ్చకీడ్వబడి, పత్రికల్లోకెక్కి నలుగురి నోళ్లల్లో పడుతోంది.

పట్టపగలే నైట్‌మేర్లు బజార్లలో పికార్లు చేస్తున్నాయి.

బ్రతుకంటే భయం; చావంటేభయం. మన గుప్పిట్లోభయం; భయం గుప్పిట్లో మనం.

ఏ తలుపైనా తట్టిచూడు; దుఃఖం స్వాగతమిస్తుంది. ఏ గోడనైనా గోకిచూడు; దుఃఖం పెల్లలుగా రాలిపడుతుంది.

దిగంతాలదాకా దృగంతాలు సారించినా, ఏ నీలమేఘమూ కాంచనరేఖాంచలమైనది కనిపించడంలేదు.

పుట్టెడు దుఃఖంలో వున్నవాడికి ఆనందభైరవి వినిపించడం మంచిది కాదు. పూటకి టికానా లేనివాడికి అఠాణా ఎందుకు?

సుహృద్వరా! కవిప్రవరా! వీణాక్వాణాలకీ, మంజీరశింజానాలకీ, పరభృతరుతాలకీ యిది వేళ కాదు.

పీడకలలు కంటూ, శప్తగృహంలో పడుకున్న సుప్త మానవుడి శవోపహారంలో దూరిన జోరీగలు కవులు. వారుచేసే రొదలే సంగీతం!

పదును పెట్టిన కత్తిలాగ అనుభవం ఊచకోత కోస్తున్నా, వేళాకోళానికిది సమయం కాకపోయినా, వస్తువుల రేఖాకృతులు స్పష్టంగా కనిపించని యీ సాంధ్యకాలపు అంధ్యంలో ఏమిటి చెయ్యడం?

త్రివర్ణచిత్రానికి రంగులు దొరకనప్పుడు వ్యంగ్యచిత్రమైనా వెయ్యద్దూ?

* * *

ఇటీవల ఆంధ్రదేశంలో కొత్తరకం కవులు బయలుదేరారు.

అయితే యీ కొత్తదనం కోసం వారి కవిత్వాన్ని వెదికేవారికి ఆశాభంగం కలుగుతుంది. మరి వారిని కొత్తరకం కవులని ఎందుకనాలి?

పాతికేళ్ళకిందట భావకవులది రాజ్యం. వారు కవిత్వంలో ఎంత నేలవిడిచి సాము చేసేవారో, జీవితంలో అంత వాస్తవికవాదులు. వీరిలో చాలమంది ఒకరి బాజా ఒకరు బాగా వాయించి హఠాత్తుగా ప్రసిద్ధులయిపోయారు. ఎవరిబాకా వాళ్లు ఊదుకోకపోవడమే వీరి వాస్తవికవాదానికి, బుద్ధికుశలతకు గొప్పతార్కాణం. ఈ విషయంలో వీరికి నాజోహారు. ఈవిషయంలో వీరికి అంతా బలాదూరు.

ఇలావుండగా యీపద్ధతి తలక్రిందు చేసి, ఆంధ్రసాహిత్యప్రపంచంలో విప్లవాత్మక పరిణామాలు తెచ్చిన కీర్తి కొందరుయువనవకవులకే చెందుతుంది.

పదహారు పేజీలుగల అణాకానీ పుస్తకం అచ్చువేసి అందులో సగం పేజీలు స్వీయచరిత్రకు కేటాయించడం యిప్పటి కవులకు పరిపాటై పోయింది.

కొత్తగా అచ్చయ్యే యువ నవకవుల పుస్తకాలు వెనక్కి తిప్పి చూడండి. అట్టమీద కవిఫోటో విధిగా వుంటుంది. కవి ఏ శుభనక్షత్రాన జన్మించిందీ, ఏ స్థలం అతని జన్మతో పావనమైందీ, అతని తెలివితేటలు ఎందరు దిగ్దంతులవంటి పండితులను దిగ్భ్రాంతులను చేసిందీ, అతని అభిరుచుల జాబితా, మిత్రులసంఖ్య, శత్రువుల సంఖ్య వగైరా వివరాలన్నీ కనిపిస్తాయి. అసలుకంటె వడ్డీ తీపి అన్నట్టు అసలు కావ్యంకంటె యీ కొసరువిషయాలే బావుంటాయనేది పరనైకవేద్యం.

మనసంగతి ఎలా వున్నా భావితరాల చరిత్ర పరిశోధకులకు, సాహిత్య విద్యార్థులకు ఈ సంగ్రహ స్వీయచరిత్రలెంతైనా ఉపకరిస్తాయి—(అప్పటికి యీ కావ్యాలుంటాయా అని ఎవరైనా కొంటె ప్రశ్న వేస్తే చెప్పలేను).

పెద్దవాణ్ణి పట్టుకుని అనగూడదుగాని, శాకుంతలం రాసిన పెద్దమనిషి ఈ టెక్నిక్ అవలంబిస్తే ఎన్నిగడ్డు ప్రశ్నలు, జిడ్డు సమస్యలు పరిష్కారమయ్యేవి!

పాతికేళ్ల కిందటి కవులకి భావకవులనే బిరుదు ఎంత సార్థకమో తెలియదుగాని, ఇప్పటికవులు అహంభావ కవులనే బిరుదుకు తగినవారు.

ఈకవులు, అజ్ఞానాంధకారంలో మునిగివున్న ప్రజానీకానికి దాస్యవిమోచనం కలిగించే స్వాతంత్ర్య ప్రదాతలు; భావికాల కౌముదీపథాలు చూపించే అభ్యుదయదూతలు; క్రాంతి ప్రవక్తలు! భళాభళి!

ఈ మహా ప్రవక్తల స్వీయకావ్యాలు హాళాహాళిలోంచి, కుప్పిగంతులలోంచి, కప్పగొంతులలోంచి సామాన్య మానవుడు తనకు కావలసిందేదో తెలుసుకోవడం ఎంత కష్టం! * * *

మొన్న ఒక ఆంధ్ర విదుషీమణి ఆకాశంలోకి చూస్తూ యిలా చెప్పింది: "చిట్టిచిట్టి తమ్ముళ్లూ! చిట్టిచిట్టి చెల్లాయిలూ! గురజాడ అప్పారావుగారి పేరు మీ రెప్పుడన్నా విన్నారా? ఆయన ఎంత గొప్పవాడనుకున్నారు? బోలెడు నాటకాలు, బోలెడు పద్యాలు, బోలెడుపాటలు, బోలెడు కథలూ, పెద్దపెద్ద పుస్తకాలూ రాశారు. మీరు పెద్దయ్యాక అవన్నీ చదువుకోండి. ఏం?..."

"ఉద్యమనాయికా! చదువుకో!" ★

# నిజానిజాలు

[అతని అనుమానం]

చలపతిరావు: లలితా లలితా...

ల: (లోపలినుంచి) ఓయ్ వొస్తున్నాను.

చ: ఈ ఆడవాళ్ళకుండే పనులేమిటో గాని, ఎప్పుడు పిలిచినా ఏదో వొక పనిలో మునిగే ఉంటారు.

ల: పిలిచారా?

చ: నేను పిలవటం స్పష్టంగా వినపడ లేదు గావును.

ల: మీతో పరాచికాలాడుతూ కూచోవటానికి నాకు తీరిక లేదు.

చ: అవతల నువ్వు వెలగబెడుతున్న రాచకార్యాలేమిటో మరి?

ల: రాచకార్యాలు చక్కపెట్టేదాన్నే అయితే, మీ రిట్లా అనక నేపోదుగు. కాకపోబట్టే, మీరే మంటున్నప్పటికీ కుక్కిన పేనులాగా పడిఉంటున్నాను.

చ: ఉపన్యాసం మధ్యలోనే ఆగింది.

ల: ఈ కబుర్లకేనా నన్ను పిలిచింది? అవతల బోలెడు పన్లు చేసుకోవాలి. వేళ మించిపోతున్నది. ఎందుకు పిలిచారో చెప్పండి.

చ: నా కలం కనిపించటల్లేదోయ్.

లలి: నాకిప్పుడు తీరిక లేదు. ఎక్కడ పెట్టుకొన్నారో మీరే వెదుక్కోండి...

పాప: (దూరంనుండి) అమ్మా, అమ్మా...

లలి. (బిగ్గరగా) వొస్తున్నా నుంఉమ్మా... (భర్తతో) అదుగో పాప గూడా వస్తోంది. నన్ను వెళ్లనివ్వండి. అడ్డం లేవండి.

చల: రాత్రి నువ్వేమయినా తీశావేమో జ్ఞప్తికి తెచ్చుకోవోయ్...

లలి: లేదు...ఐనా మీ కలం తియ్యవలసిన అవసరం నాకెందుకుంటుంది?

చల: అమాటే అనబోకు.

లలి: ఏం?

చల: ఇదివరకు నువ్వు కలం తీసినప్పుడల్లా ఏ అవసరమూ లేకుండానే తీశావా ఏమిటి?

లలి: ఇది మరీబాగుంది... నే నసలు మీ కలం ఎప్పుడు తీశానండీ?

చల: తేదీలవారీగా చెప్పేందుకు నేను నోట్ చేసుకోలేదు. లక్షసార్లు తీశావు.

లలి: (గట్టిగా) అబద్ధం; నే నొక్కసారి గూడా తియ్యలేదు. ఆ మాటకొస్తే మీ కలం ఎట్లాఉంటుందో గూడా నాకు తెలియదు.

## రావూరి భరద్వాజ

పాప: (లోపలనుండి) నా పూల గౌను కనిపించటల్లేదే...

చల: ఎందుకు కనిపిస్తుంది పాపా! ఈ యింట్లో, సామాన్లుమింగే భూతమున్నది. అది ఉన్నంతకాలం ఏ వస్తువులూ కనిపించవు.

లలి: అయితే నేను భూతాన్నన్నమాట. ఇప్పుడు కలం కనిపించలేదనేగా మీరు కోపగించుకోటం...ఎక్కడ పెట్టారో జ్ఞాపకం తెచ్చుకోండి.

చల: భగవంతుడు నాకింకా మతిమరుపు పెట్టలేదు. అదయినప్పుడు ఏమోగానీ... అంతదాకా నన్నీ విషయంలో అడగబోకు.

లలి: పొరపాటు ఎవరికైనా వొస్తుంది.

చల: (వెటకారంగా) చిత్తం. ఎవరికైనా వొస్తుంది. కానీ నా కింకారాలేదు. ఇక్కడ పెట్టిన కలం కనిపించకపోవటంతో వొచ్చి దూకిన పొరపాటేమీ లేదు.

లలి: అయితే మరేమయిందంటారు?

చల: లలితాదేవిగారు తీశారంటాను.

లలి: ముష్టి మూడుకాన్ల కలందగ్గర నన్ను అబద్ధ మాడించకండి. నేను తియ్యలేదు. అసలు మాడనన్నా చూడలేదు. చూడకపోయినా చూసినట్లు మాట్లాడటం నాకు చాతకాదు.

చల: అయితే కలం పెట్టకపోయినా, అక్కడే పెట్టానని నేను బుకాయిస్తున్నానంటావు. అవునా?

లలి: ఏమో బాబూ మీ జనమేజయ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పలేను. నన్ను వెళ్ళనివ్వండి. అవతల నాకు తలమునగా పనులున్నయ్ ..ఊ......వెళ్ళనివ్వండి.

చల: అడిగినదానికి సమాధానం చెప్పకుండా అల్లా దూసుకుపోతా వేం?

లలి ఇంకా ఎన్ని సార్లు చెప్పమంటారు? నేనా కలం తియ్యలేదు. నాకు తెలియదు.

చల: మరి డ్రాయరుమీద పెటిన కలం ఏమయినట్లు? నేను మింగానా? లేకపోతే డ్రాయరు మింగిందా?

లలి: ఆ విషయం నన్నడగకండి. అది మీరూ, ఆ డ్రాయరూ కలిసి తేల్చుకోండి.

పాప: (లోపలనుండి ఆదుర్దాగా) అమ్మ అమ్మ వంటింట్లోకి కుక్క జొరబడిందమ్మ...

లలి. ఈ దిక్కుమాలిన గోలతో వంట సంగతే మరిచిపోయాను. అక్కడెంత ముక్క చెక్కలుగా ఉందో ఏమో?

చల: ఇదుగో.. ఏయ్......నిన్నే— నే నడిగినదానికి జవాబు చెప్పకుండా పోతా వేం?.. తప్పించుకోడానికి మంచి వంకే దొరికింది దానికి. దాన్ని తీసినచోట ఉంచితే ఏ చిక్కూ రాకపోను. అయినా నా కలముతో ఇది పాటలు రాసుకోవటమేమిటో నాకెన్నన్ను. చేతిలో కలం లేకపోతే మరీ పిచ్చెక్కినట్లుగా ఉంటుంది. ఇప్పుడేమి చేసేట్టు?

### రంగం 2

(ఆమె అనుమానం)

చల: లలితా లలితా...

లలి: (లోపలనుంచి) ఓయ్ వొ[illegible]స్తున్నాను.

చల: ఈ ఆడవాళ్ళకుండే పనులేవిటో గాని ఎప్పుడు పిలిచినా ఏదో ఒక పనితో మునిగే ఉంటారు.

లలి: పిలిచారా?

చల: అదేమిటో నేను పిలవటం స్పష్టముగా వినపడలేదా ఏం?



"ఏనా మీ కలం తియ్యవలసిన అవసరం నాకెందుకుంటుందీ ?"

లలి: మీతో పరాచికాలాడుతూ కూచోవటానికి నాకు తీరిక లేదు.

చల: అబ్బో, అవతల తమరు రాదకార్యాలు చక్కబెడుతున్నారు గావును, ఏమండీ లలిత గారూ?

లలి: నే నంతస్వతంత్రురాలినయితే మీరిల్లా అనక నేపోదురు. కాకపోబట్టే, మీరింత ఇదిగా మాట్లాడుతున్నా కుక్కిన పేనులా గా పడిఉంటున్నాను.

చల: ఉపన్యాసం మధ్యలో నే ఆగిపోయింది. తుదముట్ట కానివ్వ

లలి: ఈ కబుర్లకేనా నన్ను పిలిచింది? అవతల బోలెడు పనులున్నాయి. ఇప్పటికే వేళ మించిపోతున్నది. ఎందుకు పిలిచారో చెప్పండి త్వరగా...

చల: అబ్బే మరేమంత పెద్దపనికాదు. నా ఫౌంటెన్ కలం కనిపించలేదు.

లలి: ఈ మహాభాగ్యానికా, పనివేళ నన్ను పిలిచారు? ఎక్కడ పెట్టుకున్నారో వెదుక్కోండి. నేను వెడుతున్నాను.

పాప: (దూరంనించి) అమ్మా అమ్మా..

లలి: (బిగ్గరగా) ఒస్తున్నానుండమ్మా (భర్తతో) అదుగో పాపగూడా వస్తోంది. అడ్డం లేవండి నేను వెళ్ళాలి.

చల: నే నడిగినదానికి సమాధానం చెప్పవేం?

లలి. ఎక్కడిపనులు అక్కడే ఉన్నయ్... ఇప్పణ్ణించీ వొంచిన నడుం ఎత్తకుండా చేస్తే నే గాని, ఆవేళకు తెమిలి చావదు. లేవండీ ఊరికే నాతో కొండాటక వాడకుండానూ...

చల: మొత్తానికి నీ పొదుపుగుణం వొదిలావు గాదు. అడుగుతున్న దానికీ, బదులు చెప్పకుండా, దులపరించుకుపోతా వేమిటోయ్...

లలి: మీకు మాటిమాటికీ పొదుపుగుణం పొదుపుగుణం అన్నారంటే బాగుండదండీ— నే నిప్పుడే చెబుతున్నా...

చల: అంటే? నీవనేదేమిటో నాకు అర్థంగా లేదు.

లలి: నేను దేవభాషలో మాట్లాడలేదు; అర్థంగాకపోవడానికి—లేవండి నేను వెళ్ళాలి.

చల: నిన్నిక్కడెవరూ పట్టుక్కూచో లేదు. ఆ కలం ఎక్కడపెట్టావో చెప్పి నిరభ్యంతరంగా వెళ్ళిపోవచ్చు.

లలి: ఎక్కడ పెట్టటమేమిటి ? అసలు దాన్నెవరుతీశారు? ఏనా మీ కలం తియ్యాలిసిన అవసరం నాకెందుకుంటుందీ?

చల: ఇప్పుడంటే అన్నావుగానీ, ఇంకో సారి ఆ మాట అనబోకు.

లలి: నేనేం తప్పుమాటన్నానుటండీ... అల్లా కళ్ళెర్రజేస్తారు ?

చల: ఇదివరకు నువ్వు కలం తీసినప్పుడు

# నిజానిజాలు



ఏ అవసరమూ లేకుండానే తీశావులే...

లలి: ఇది మరీబాగుంది...నోటికొచ్చింది గదా అని, ఏమాటబడితే అది అనెయ్యట మేనా ? నే నెప్పుడు మీ కలం తీశాను చెప్పండి చూతాం...

చల: మంచి ప్రశ్నే వేశావు. వ్యవహారం ఇంతదాకా వొస్తుందని తెలిస్తే, నువ్వు కలంతీసిన తేదీలన్నీ నోట్ చేసి ఉండే వాణ్ణి.

లలి: దిక్కుమాలిన కలంకోసం నన్ను అబద్ధమాడించకండి. ఒక్కసారి గూడా నేను మీకలం తియ్యలేదు. ఆ మాటకొస్తే దాన్నింతవరకూ కళ్ళతోనైనా చూడలేదు.

చల: అబద్ధమాడటం ఆడవాళ్ల దగ్గరే నేర్చుకోవాలి అన్నాడొక గొప్పకవి. అంటే, నీకు కోపమొస్తుందిగానీ, ఇదివరకు నువ్వు పాటలు రాసుకోవటానికి నా కలం తీసుకోలేదులే...

లలి: (అంగీకరించక తప్పక) ఏమోలెండి బుద్ధిలేనిదాన్ని - ఎప్పుడన్నా తప్పి దారి తీశానేమో మీచేత చివాట్లు తిన్నానేమో ...ఇంకేం సరిపోయిందిగా...

పాప: లోపలనుండి—అమ్మా నా పూల గౌను కనిపిట్లేదే...

లలి: ఎందుకు కనిపిస్తుంది తల్లీ ఈ ఇంటో వొస్తువులు మ్రింగే భూతంఉన్నది. గౌన్లూ కనిపించవు. కలాలూ కనిపించవు.

చల: అల్లా అనుకోకపోతే—

లలి: నేనే తీశానని వొప్పుకోమంటారు. ప్రమాణపూర్తిగా చెబుతున్నాను. నేను మీ కలం తియ్యలేదండీ...తీశానని చెబితే, మీరు కొడతారా? కొరత వేస్తారా? అబద్ధం చెప్పవలసిన పనేముంది ?

చల: మరయితే ఏమయిపోయిందా అని?

లలి: ఇంటికి బోలెడుమంది వొస్తుంటారు; - అన్నట్టు - ఇందాక పాలుపోసే పిల్లాడొచ్చాడు.

చల: వొస్తే, వొస్తే ఏమయిందంటావ్?

లలి: వాడొచ్చేటప్పటికి నేను దొడ్లో ఉన్నాను; ఏదో పనిచేసుకొంటూ...పాప కూడా ఎక్కడికో వెళ్ళింది.

చల: ఈ ఉపోద్ఘాతం చాలు. ఇంతకీ జరిగిందేమిటో చెప్పు.

లలి: అబ్బ నన్ను చెప్పనివ్వండి. ప్రతి దానికీ ఒకటే తొందర. నేను పాలగిన్నె తీసుకొచ్చేటప్పటికి వాడు డ్రాయరుదగ్గర తచ్చాడుతున్నాడు.

చల: అయితే కలం వాడు తీశాడంటావా ఏం?

లలి: ఇంకో అంటావా అని మెల్లగా అంటారేమండీ...మీరేమో కలం ఇక్కడే పెట్టామంటుంటిరి. నేనా దాన్ని ముట్టుకొనైనా ముట్టుకోలేదాయె...మనింటికొచ్చిందల్లా, ఆ పాల అబ్బి వొకడేగా...ఇంకేం ...ఆ వెధవే పట్టుకుపోయి ఉంటాడు. మీరల్లా - ఏమీ తెలీనట్లు ఊరుకోండి. నేను మక్కెలు విరగదన్ని వాడిచేత కలం తెప్పిస్తాను. అమ్మ భడవా...ముచ్చులాగా ఉండి ఎంతపని చేశాడండీ వాడు...

నెల్లాళ్ళనుంచీ మేస్తున్న అతిథి గృహస్థుతో: "మీ యింట్లో యిన్నాళ్ళూ బాగానే నిద్రపట్టిందిగాని రెండు రోజుల్నించీ నిద్రపట్టడం లేదండీ!"

గృహస్థు: "నాకసలు నెల రోజుల్నించీ కంటిమీద కునుకు లేదంటే నమ్మండి."

(వి. పాండురంగారావు-మద్రాసు)

## రంగం 3.

### (మల్లయ్య అనుమానం)

చల: లలితా, లలితా!

లలి: ఓయ్ వొస్తున్నాను (అంటుంది దూరంనుంచి)

చల: ఈ ఆడవాళ్ళకు ఎప్పుడు తీరిగ్గా ఉంటుందో ఏమో గానీ, ఏ క్షణాన పిలిచినా, ఏదో వొక పనిలో మునిగే ఉంటారు.

లలి: ఎందుకండీ పిలిచారూ?

చల: అబ్బే మరేమంత పెద్దపని కాదు. నా ఫౌంటెన్ కలం కనిపించలేదు.

లలి: ఈ మహాభాగ్యానికేనా పనివేళ నన్ను పిలిచారు? ఎక్కడ పెట్టుకున్నారో వెదుక్కోండి. నేను వెడుతున్నాను.

పాప: (దూరంనుండి) అమ్మా అమ్మా..

లలి: (బిగ్గరగా) ఒస్తున్నానుండమ్మా (భర్తతో) అదుగో పాపగూడా వొస్తోంది. అడ్డం లేవండి. నేను వెళ్ళాలి.

చల: నేనడిగినదానికి సమాధానం చెప్పకుండా అల్లా దులబరించుకు పోతావేమే..

పాప: (దగ్గరకొచ్చి) అమ్మా నా గౌను ఏదీ?

లలి: నాన్నగారినడుగు తల్లీ...ఏమండీ పాప గౌనట - ఆ వొంకెనున్నది - కొస్త తీసి యివ్వండి. నేను వెడుతున్నాను. అవతల బోలెడు పనులున్నయ్. ఇప్పట్నించి చేసినా, తెమిలి చావదు. (వెడుతుంది)

పాప: నాన్నా, ఆ పూల గౌను యివ్వవూ? అక్కడ వెదుకుతావేం నాన్నా... ఇక్కడ - ఈ వంకెకున్నది నాన్నా, గౌను...

చల: గౌను సరేకానీ, నా కలం కనిపించటల్లేదు. నువ్వేమయినా తీశావా పాపా...

పాప: (పరధ్యానంగా) ఏమిటి నాన్నా?

చల. కలం కనిపించటల్లేదు పాపా. నువ్వేమయినా తీశావా?

మల్లయ్య: (వొస్తూ) ఇదుగో చలపతిరావుగారూ! మొన్న మా అల్లుడు మీకు గుంటూర్లో కనిపించాటగా...మా వియ్యపురాలి కెల్లా ఉన్నదో మీతో చెప్పాడాండీ...ఏమేవ్ పాపా! బాగున్నావా?

చల: రండి మల్లయ్యగారూ! కూచోండి......ఒక్క నిమిషం ఆగండి మాట్లాడదాం. ఏం పాపా చెప్పమ్మా ఎక్కడ పెట్టావమ్మా...

మల్లయ్య: ఏమిటి చలపతిరావుగారూ!

చల: కలంలెండి - చెప్పమ్మా నువ్వు బంగారు కొండవు. మా అమ్మవుగదూ...

పాప: నేను చూడలేదు నాన్నా...

మల్ల: కనిపించలేదా ఏం?

చల: అవునండీ నేను ఎంతో జాగ్రత్తగా ఇక్కడపెట్టాను. మీ శ్యామ్మనడిగితే తనకు తెలియదన్నది. అందుకని దీన్ని అడుగుతున్నాను.

మల్ల: కలాలు, పెన్సిళ్లు, గడియారాలు ఇట్లాంటి విషయాల్లో పెద్దవాళ్లను అడగవే అడగకూడదు. ఏదో ఆటవొస్తువుగదా అని - పిల్లలే తీసిఉంటారు.

పాప: లేదు తాతయ్యా! నేనసలు ఆ కలం చూళ్లేదు తాతయ్యా...

చల: (కోపంతో) అయితే ఏమయిపోయిందంటావే ధడవా...నిజం చెబుతావా చెప్పు, లేకపోతే పంతులుగారితో చెప్పి కోదండం వేయిస్తాను. తెలుసా...

పాప: (ఏడుస్తూ) నేనసలు తియ్యలేదు నాన్నా...

మల్ల: ఇదుగో చలపతిరావుగారూ పిల్లల చేత నిజం చెప్పించాలంటే - వాళ్లను గదమాయిస్తే అసలు చెప్పరు. నేర్పుగా లాలించాలి.

లలి: (వస్తూనే) ఇదేమిటి...ఎందుకు పాపా ఏడుస్తున్నావ్...ఏమండీ అమ్మాయి నేమన్నా అన్నారా?

పాప: (ఏడుస్తూ) మరే అమ్మా! నే నట నాన్నగారి కలం తీశానటమ్మా...

లలి: చిన్న పిల్లలన్న తరవాత ఏ వస్తువూ ముట్టుకోకుండా ఎట్లా ఉంటారు? ఆ ఈడప్పుడు అంతా అటూ మిడిసినవాళ్లే. గడ్డాలు



'బుద్ధుడు'

చిత్రకారుడు: పి. నాగేశ్వరరావు, వల్లభాపురం

మీసాలు రాగానే పెద్దమనుషులయిపోతారు.

చల: ఆపుతావా నీ బాగుడు, లేకపోతే పిచ్చి పెట్టిపోవాలా?

మల్ల: చలపతిరావుగారూ! ఆ వదానిమీదికి అట్లా దూకబోకండి. మీరు చదువుకున్న వాళ్లయితే అయ్యారుగాక. కొంత శాంతంగూడా ఉండాలి.

లలి: అది మా యింటా వంటా లేదు మల్లయ్యబాబాయ్!...

చల: నోర్ముయ్...

మల్ల: ఆగండాగండి...నువ్వు లోపల కెళ్ళి పని చూసుకో లలితా...పాపా... ఇల్లా రా అమ్మా... ఇస్... ఏడవబోకు మరి. యేక్కడే... మంచి పిల్లలు ఎక్కడన్నా ఏడుస్తారా మరి? ఇటు చూడమ్మా... నేను తాతయ్యను గదూ... నీకు పిప్పరమెంట్లు కొని పెడతా...కలం ఎక్కడపెట్టావమ్మా...

పాప: నేను తియ్యలేదు తాతయ్యా...

# ★ నిజానిజాలు ★

శశి: అది మాటలతో నిజం చెబుతుండేటండీ మీ పిచ్చిగానీ...

లలి: లేకపోతే చంపండి. మీ కళ్ళు చల్లబడతై అప్పటికి.

మల్లి: లలితమ్మాయ్, ఏమిటా మాటలు నువ్వు వెళ్ళి నీపని చూసుకో.. చలపతిరావు గారూ! ఒకసారి ఏం జరిగిందంటే మా పెద్ద మేనల్లుడు, వాళ్ళ నాన్న గడియారం తీశాడు. ఎందరెన్ని విధాల అడిగినా నేను తియ్యలేదన్నాడు. నాలుగురోజుల తరవాత వాడే, బొగ్గుల బస్తాలోనుంచి తీసి యిచ్చాడు. మాశారూ పిల్లలు భయపడి - వెంటనే నిజం చెప్పరు. రెండు మూడు రోజుల్లో - నేనే - మెల్లిగా - పాప చేత కలం చెప్పిస్తాను. మీ రూరుకోండి.

లలి: ఆయన నూరుకోడం కూడానా? అన్నింటికీ వొకటే తొందరా - వొకటే చిరాకూ. మొదట్లో నేను తీశానన్నారు.

చల: అనుకున్నాను. నా నోటుబుక్కులు చాకలిపద్దులికీ, నా పౌంటెన్ పెన్ పాటలు రాసుకుందుకీ తీయడం మామూలు గనక—

పాప: అవున్నాన్నా - నేనూ చూశాను. చాలాసార్లు తీసింది.

లలి: తీస్తేమాత్రం? నే నేం దాచుకున్నానా? మళ్ళీ వెంటనే అక్కడే పెట్టేసేదాన్ని కానా యేమిటి?

చల: నిజమే. అందుకే నువ్వు తీసుండవని నమ్మకం కలిగింది. అపాలక్రాజే తీసుంటాడు.

లలి: ఏమో వాడు మీ డ్రాయరు దగ్గిర నిలబడ్డాడని అనుమానించాను గాని - వాడు తీసినట్టు లేదు. నా కైనన్ని విధాల నయాన్నీ భయాన్నీ అడిగిచూశాను.

పాప: అవునాన్నా ..వాణ్ణిందాకా అమ్మ కొట్టబోయింది.

లలి: అంతేకాదు. ఒక రూపాయినోటు బల్లమీద పెట్టాను. వాడు వచ్చాక నేను లోపలికి వెళ్లి తలుపు సందునుంచి చూశాను. వాడా నోటువంక చూశాడు కాని - దాన్ని ముట్టుకోనైనా లేదు. నాకు నమ్మకమే. ఆ కలం వాడు తీసివుండడు.

- మల్లయ్య: ఎవ్వరూ తీయలేదు. నాకు తెలుసు - పాపే తీసి, ఎక్కడో పెట్టి మరిచిపోయింది.

చల: అది నా బల్లమీద పిసీ ముట్టుకోదండి మల్లయ్యగారూ...

మల్లి: ఇదివర కెప్పుడూ చెయ్యలేదు

(49-వ పేజీ చూడండి)



భిల్లదంపతులు చిత్రకారుడు: బి. వి. రత్నం.

# తానొకటి తలిస్తే...

భగవంతు డెప్పుడైనా మన స్తత్వాలలో పూర్తిగా వ్యతిరేకమయిన వ్యక్తులను సృష్టిస్తే, వాళ్ళు రాజు, రామకృష్ణ అయి వుంటారు. ఇద్దరూ ఒకే కాలేజీలో ఒకే క్లాసులో చదువుతున్నారు; ఒకే గదిలో వుంటున్నారు. అయినా, వాళ్ళిద్దరికీవున్న వ్యత్యాసం చాల తక్కువమందికి వుంటుంది.

కండలు మెలిదిరిగి, పొడుగ్గా, పొడుగుకు తగ్గ లావుగా వుంటాడు రాజు. అందానికి మన్మధుడు కాకపోయినా అసహ్యించుకో వలసిన ఆకారం కాదు. ఆటలలో అతని కీర్తి కాలేజి అంతటా తెలుసు; మిగత కాలేజీల్లోకూడ చాలచోట్ల తెలుసు. అతను అప్పుడప్పుడు విసిరిన బంతులు గురించి, క్రికెట్ నేర్చుకోబోతున్న ప్రతి విద్యార్థి విడ్డూరంగా చెప్పేవాడు. చదువురాక, సిసలైన ఆటగాళ్లు కాలేక, క్రికెట్టే నాగరికత అని భావించే అనాగరికులు, రాజు ఏనాడు ఎన్ని పరుగులు చేశాడో కంఠతా పట్టారు.

రాజును గురించి అందరికన్నా తక్కువ తెలుసుకొన్నవాడు, అతని గదిలోనే వుంటున్న రామకృష్ణ. సన్నగా, పొడుగ్గా, లావుటద్దాల కళ్లజోడుతో, రేగిన జుట్టుతో ప్రత్యక్షమయ్యే రామకృష్ణ అందరికన్నా అమాయకుడు. పుస్తకాలు చదవటానికి తప్ప మరెందుకూ, పనికిరాని మనిషి! నలుగురిలో తిరగటానికి భయపడే ఈ రామకృష్ణ గురించి, అతను చదువుతున్న క్లాసులో తప్ప ఇంకెక్కడా తెలియదు. ఆక్లాసులో మాత్రం అతని మార్కులుచూచి నివ్వెరపోనివాడు లేడు. పడకకుర్చీలో పడుకుని పుస్తకం తరువాత పుస్తకం పూర్తిజేసే ఆ వింత యువకుడు, నిజంగా అంత వింత మనిషి కాదు. చదవటం అతని స్వభావం; ఆడటం రాజు స్వభావం లాగ. ఏ సదుపాయాలకోసంగాని, మార్కులకోసం గాని రామకృష్ణ చదవలేదు; టెస్టు ప్లేయరు అవుదామని రాజు క్రికెట్టు నేర్చుకోలేదు. రాజుకు గిల్లియన్, చీతమ్, హట్టన్ ఎటువంటి స్నేహితులో రామకృష్ణకు డాస్టాయ్‌విస్కీ, డికెన్సు, అటువంటి స్నేహితులు. రాజు ట్రూమన్ బౌలింగుగురించి అందరికీ చెపుతూవుంటే, రామకృష్ణ హెరాల్డ్ స్కిమ్‌పూల్ గురించి తనలో ఆలోచించుకుంటూవుండేవాడు.

ఏదెలాగున్నా, వాళ్ళిద్దరూ స్నేహితులుగానే కాలం గడుపుతున్నారు. నిజం మాట్లాడాలంటే, ఏమీ సంబంధం లేని వాళ్లు ఎక్కువగా స్నేహితులు అవుతారు. అటువంటి స్నేహంలో ఈర్ష్య, అసూయ కూడ వుండవు. కాని అటువంటి స్నేహాన్ని, స్నేహం అంటారో లేక పరిచయం అంటారో అనుమానాస్పదం. ఏదెలాగున్నా, ఒకరితో ఒకరికి సంబంధం లేకుండా స్నేహంగా గడుపుతున్నారు కాలాన్ని, రామకృష్ణ రాజులు.

వీళ్ళిద్దరి క్లాసులోనే ఇంకొక వ్యక్తి వుంది. ఆమె పేరు అనసూయ. అలా

పే. గో.

చెప్పగా నేమిలో చాలామంది వీళ్ళిద్దరూ ఆమెను ప్రేమిస్తున్నారంటారు కాని, అలా ప్రేమించటం లేదని నాఅనుమానం. రాజుకాని, రామకృష్ణ కాని, ఆమెను ప్రేమించలేదు. ఆమెను గురించి వాళ్ళ భావాలేమిటో తెలుసుకునే ముందు అనసూయ ఎవరో తెలుసుకోవాలి.

అనసూయ ఫలానా డాక్టరుగారి అమ్మాయి, ఫలానా ప్లీడరుగారి అమ్మాయి అని చెప్పే కన్నా అనసూయ అనసూయే అని చెప్పటం మంచిది. ఎందుకంటే, పట్టణమూ పల్లెటూరూ కాని ఆ ఊరిలో అనసూయ అంటే తెలియనివాళ్ళువుండరు. ఆమె పురాణకాలపు అనసూయ కాదు. స్త్రీ సహజమైన సిగ్గుకూడ ఆమెలో లేదు; గడుసుదనం ఆమె సొత్తు. ఆమె ప్రవర్తన గురించి ఆవూరిలో కొందరికి అనుమానం లేకపోలేదు. కాని, నలుగురిలో ఆమెనుగురించి నీచంగా మాట్లాడినవిద్యార్థి, ఆమెనుగురించి 'సినికల్'గా మాట్లాడిన డెమాన్ స్ట్రేటర్, ఆమె అందని పండని తెలుసుకున్నాకే అలా చేశారు. ఎంతమంది ఆమెచేత అవమానింపబడలేదు! ఒక్క ప్రేమలేఖతో ఎంతమంది జీవితం నాశనం కాలేదు? ఎంతమంది విద్యార్థులు ఆమె అన్నయ్యచేత చావుదెబ్బలు తినలేదు? - నిజం మాట్లాడాలంటే, ఆమెనుంచి ముడుచుకు పోనివాడు లేడు.

రాజు ఈ విషయంలో అందరివంటి

(52-వ పేజీ చూడండి)




## 22

యువకులిద్దరూ కలిసి ఒక పానశాల ప్రవేశించారు. అప్పటికే దీపాలు పెట్టారు. పానశాలలో సందడి అధికమౌతోంది. త్రాగుబోతుల సోమరిపాటలు, గ్లాసుల గలలు వింటూ క్లాడ్ ఫ్రాలో ఆ యింటిముందు పచార్లు చెయ్యసాగాడు. నిలువెల్లా నల్లనికోటుంది. జేబులోనుంచి నల్లనిగుడ్డ ఒకటితీసి ముఖం కప్పుకుని వెనుక ముడి వేసుకున్నాడు. కన్నులు కనపడ్డానికి ముందు రెండు రంధ్రాలున్నాయి, అప్పుడు ఆగి కిటికీలోనుంచి తొంగిచూస్తున్నాడు.

కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నాయి, యువకులిద్దరూ తాగి తూలుతూ వీధిలోకి వచ్చారు. క్లాడ్ ఫ్రాలో ప్రక్కకు తప్పుకున్నాడు.

"ఏడుగంట లయిందోయ్! ఇంక వెళ్ళాలి నేను." అన్నాడు ఫీబస్.

"ఏమిటి? మా యిల్లా? నాకో యిల్లేమిటి?" అంటూ తడబడ్డాడు జెహాన్.

"అబ్బ! నామాట వినిపించుకోవేం? అంత తప్పతాగావా?"

"ఏమిటి? ప్లాటో? ఏమన్నాడు? వాడిమొహం పీటకుక్కమొహంలా ఉండేదట!"

"అబ్బ. ఇహ వీడికి నామాట వినపడదు." అని విసుక్కున్నాడు. ఇద్దరూ ఒకరికొకరు ఆనుకుని నడుస్తున్నారు. క్లాడ్ అలాగే వారు చూడకుండా వెంబడించాడు.

"అరె! నేనింకపోవాలి. నన్నొదలవోయ్. ఏడుకొట్టింది" అంటున్నాడు ఫీబస్.

"హా! నిన్నెవ్వడు పట్టుకున్నాడు?" అంటూ ఫీబస్ చేతిని గట్టిగా పట్టుకున్నాడు జెహాన్. "నా కళ్ళముందు తారకలు మెరుస్తున్నాయి..."

"అన్నట్టు, నీదగ్గిర డబ్బేమైనా కొద్దిగా మిగిలిందా? అబ్బ! కొంచెం తెలివి తెచ్చుకోవోయ్" అంటూ గట్టిగా గుంజాడు ఫీబస్. జెహాన్ తూలి గోడపక్కకు పడిపోయాడు. ఫీబస్ అతన్ని జబ్బలు పట్టుకుని కొద్దిదూరంలో నాపరాయిదగ్గరకు ఈడ్చుకుపోయాడు. అక్కడే అలా పడుకుని గుర్రుపెట్టడం మొదలుపెట్టాడు జెహాన్. విసుగుచెంది అతన్ని అక్కడే విడిచిపెట్టి ఫీబస్ నడక సాగించాడు.

క్లాడ్ ఫ్రాలో తమ్ముడివద్దకు వచ్చి చూశాడు. ఒక్క నిట్టూర్పు విడిచి తమ్ముడివంక చూసి, తిరిగి ఫీబస్‌ని వెంబడించాడు.

కొంతదూరం వెళ్ళాక తన వెనకో అనుసరిస్తున్నట్లు ఫీబస్‌కి అనుమానం కలిగింది. ఆగి వెనక్కి చూశాడు. వెనక నీడవలె అనుసరిస్తున్న క్లాడ్ ఫ్రాలో ఆగాడు. ఫీబస్ నడిచాడు. వెనుక నీడ కూడా నడిచింది. ఫీబస్ వెనుతిరిగి చూశాడు. నీడ కనపడింది. ఇంక లక్ష్యపెట్టకుండా నడవ నారంభించాడు. "నావద్ద యేముంది? దారికొట్టడానికి—చిల్లిగవ్వ లేదు" అనుకున్నాడు.

నాలుగు రోడ్లు కలిసే కూడలివద్ద ఆగాడు ఫీబస్. ఈమాటు క్లాడ్ ఫ్రాలో ఆగలేదు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఫీబస్‌ని సమీపించాడు.

కర్రలూ కత్తులతో దొంగలు వచ్చినా భయపడని ఫీబస్‌కి, ఈ ఆకారం చూడగానే కొంచెం భయం కలిగింది. దయ్యమొకటి క్రైస్తవ మతాచార్యుని వేషంలో తిరుగుతోందని వ్యాపించిన వదంతులు ఫీబస్ అదివరకే విని ఉన్నాడు. నిలబడి-

మూలం :
విక్టర్ హ్యూగో

అనువాదం :
సూరంపూడి సీతారామ్

చోటనుండి కదలలేకపోయాడు. క్లాడ్ అతనివద్దకు వచ్చి నిలిచాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు ఫీబస్ కంపిస్తున్న స్వరంతో. "ఎవరు? దొంగవా? నా దగ్గర చిల్లిగవ్వ లేదు. ఇంకొకణ్ణి చూసుకోడం మంచిది."

క్లాడ్ ఫ్రాలో చెయ్యిజాపి ఫీబస్ భుజం పట్టుకున్నాడు. "కప్టెన్ ఫీబస్" అన్నాడు.

"నా పేరుకూడా తెలుసునా?"

"నీ పేరేకాదు; ఇప్పుడు నువ్వెందు కెక్కడికి వెడుతున్నావో కూడా తెలుసు."

"తెలుసా?"

"ఏడుగంటల కొక యువతిని కలుసుకోడానికి వెడుతున్నావు."

"అవును."

"ఆమె పేరు?"

"ఎస్మరాల్డా" అన్నాడు ఫీబస్.

"అబద్ధం" అన్నాడు క్లాడ్ కోపంతో, ఫీబస్‌కి ఇంక భయం పోయింది. కత్తిమీదికి చెయ్యి పోనిచ్చాడు.

"అబద్ధం నా జన్మలో ఎరగను" అంటూ ఫీబస్ ఎర్రని పటపట కొరికాడు. "అయ్యో నీ కత్తి ఇక్కడే తేల్చుకుందాం" అంటూ కత్తి తీశాడు.

క్లాడ్ చలించలేదు. "కప్టెన్ ఫీబస్. ఏడుగంటలయిందప్పుడే. నీపని మరిచిపోతున్నావు" అన్నాడు.

వెంటనే కత్తిదించేశాడు ఫీబస్.

క్లాడ్ ఇలా అన్నాడు "సరే ఇప్పటికి వెళ్లు. తరవాత నీతో కత్తియుద్ధానికి ఎప్పుడైనాసరే నేను సిద్ధమే—వెళ్ళు."

"సరే. సిద్ధంగానే ఉండు. నీదగ్గర డబ్బేమైనా ఉందేమో ముందు చూడు. నాదగ్గర బొత్తిగా ఏంలేదు."

"ఇదిగో తీసుకో" అని క్లాడ్ డబ్బుతీసి ఇచ్చాడు. "ఒక షరతుమీద ఇస్తున్నాను. నువ్వు అబద్ధమాడ్డం లేదని నిరూపించుకో. నువ్వు కలుసుకోబోతున్నది ఎస్మరాల్డా అవునో కాదో నేను తెలుసుకోవాలి?"

"ఏం చెయ్యమంటావు?"

"నువ్వామెను కలుసుకునేచోట నన్ను ఒక మూల దాచు."

"అంతేనా పని!"

"అయితే సరే"

"సరే. నువ్వు దెయ్యమో, మనిషో నాకు తెలియదు. ఎవరైనా నాకు పనిలేదు; ఈపూటకి మనిద్దరం స్నేహంగా ఉందాం. రేపు నీబాకీ నీకు తీర్చి, అప్పుడు కత్తియుద్ధానికి వస్తాను."

ఇద్దరూ త్వరత్వరగా నడిచారు. కొంతదూరం వెళ్లేసరికి నదీ ప్రవాహం గలగలమని వినవచ్చింది. నది వంతెనపైనే కొన్ని ఇళ్ళుకూడా ఉన్నాయి. అక్కడ ఫీబస్ ఆగాడు, "ముందు నేను చూసివస్తాను. నువ్విక్కడే ఉండు" అన్నాడు. ఫీబస్ కొద్ది ముందుకువెళ్ళి ఒక యింటిముందాగాడు దబదబ తలుపుబాదాడు.

"ఎవరు?" అని లోపలినుండి వినవచ్చింది. తరవాత తలుపు తెరుచుకుంది. గుడ్డిదీపంచేత పట్టుకొని వొంగిపోయిన వృద్ధురాలొకామె వచ్చింది. ఆమె దుస్తులు బొత్తిగా చినిగిఉన్నాయి. తల వొణుకుతోంది. పళ్ళులేవు.

లోపలి వసారా బూజు, దుమ్ముతో నిండిఉంది. వసారా వెనుక నిచ్చెనవంటి కర్ర మెట్లున్నాయి మెట్లెక్కితే మిద్దె వస్తుంది. ఫీబస్ వసారాలోకి వచ్చి మెట్లెక్కాడు, క్లాడ్ అతనిననుసరించాడు. ఫీబస్ వృద్ధస్త్రీ చేతిలో ఒక నాణెం ఉంచాడు. ఆమె అది ఒకసారి చూసుకుని గోడప్రక్కనున్న మేజా అర లాగి అందులో పడేసి అర మూసింది. ఆమెకూడా మెట్లెక్కడం మాని గది మధ్యలో ఆడుతున్న బాలు డొకడు మేజా అరలోని నాణెం సంగ్రహించి ఎండిన ఆకొకటి అందులో ఉంచి అర మూశాడు.

ముగ్గురూ మిద్దెమీదికి వెళ్ళారు. ఆమె మిద్దె వసారాలో దీపం ఉంచింది ఫీబస్ వసారా వెనుక ద్వారం తెరిచాడు. అదొక చీకటి గది. ఫీబస్ అదిమాపి "అక్కడుండు నువ్వు" అని క్లాడ్‌కి సంజ్ఞచేసి చెప్పాడు. ఫీబస్ తలుపులుమూసి గడియ వేశాడు. తిరిగి మెట్లుదిగి వృద్ధస్త్రీతో కలిసి కింది సారాలోకి వచ్చాడు.

క్లాడ్ ఫ్రాలో చీకటిగదిలో కొంతసేపు తచ్చాడి చూశాడు. కోణాకారంలో ఉన్న ఆ గది కప్పు అతడి తలకు తగులుతోంది. ఆ చీకటిలో అక్కడే దుమ్ములో కూలబడ్డాడు. అతని మెదడులో అనేక ఊహాలు పొడగట్ట నారంభించాయి. ఎస్మరాల్డా, ఫీబస్‌ల రూపాలు అతని మనోనేత్రంలో గోచరించాయి. అతనికి శరీరమంతా దహించ నారంభించింది.

పావుగంటసేపు అలా ఉన్నాడు. పావుగంట ఒక యుగంలా ఉందతనికి. ఉన్నట్లుండి మెట్లు కిర్రుమన్న శబ్దం వినవచ్చింది. మిద్దెతలుపు తెరుచుకుంది. గుడ్డివెలుగు వచ్చింది. చీకటి తలుపుల సందునుంచి వెలుగు క్లాడ్‌కి కనపడింది. మిద్దెపై వసారాలో ఏం జరుగుతున్నదీ అతనికి స్పష్టంగా కనపడుతోంది. ముందు వృద్ధురాలు కనపడింది. ఆమె వెనుక ఫీబస్ వచ్చాడు. ఆ వెనుక ఎస్మరాల్డా! ఆ దివ్యసుందర విగ్రహాన్ని చూడగానే క్లాడ్ కంపించిపోయాడు. కన్నులకు చీకట్లు కమ్మాయి. గుండె దడదడలాడింది, తల తిరిగింది. స్పృహతప్పింది.

తిరిగి మెలకువ వచ్చేసరికి ముందు వసారాలో ఫీబస్, ఎస్మరాల్డా ఇద్దరే కనిపించారు. దీపంప్రక్క కొయ్యబెంచీ పైన ఇద్దరూ కూర్చున్నారు. ఇద్దరిపైనా వెలుగు పడుతోంది. వసారాకి రెండు ప్రక్కలా రెండు కిటకీలున్నాయి. ఒక కిటికీలో నుంచి ఆకాశం, చంద్రుడు, నక్షత్రాలు కనపడుతున్నాయి.

"ఎస్మరాల్డా ముఖం సిగ్గుతో కందిపోయింది. ఆమె కొల్లవన్నె మేక పడుకునివుంది ఆమె ఆనందం అణుచుకోలేకపోతున్నట్లు ముఖమే చెప్తోంది. చూపులు నేలపై ఉన్నాయి. వేలితో ఊరికే బల్లపైన రాస్తోంది.

క్లాడ్ చెవులు రిక్కించి విన్నాడు.

ఎస్మరాల్డా తలవంచుకునే అంది "నేను చేస్తున్నది తప్పని తెలుసు. కాని నన్ను చూసి అసహ్యించుకోకండి"

"అసహ్యించుకోడమా? అబ్బెబ్బే! ఎప్పుడూ లేదు" అన్నాడు ఫీబస్, ప్రేమనటిస్తూ. "అయినా అసహ్యం ఎందుకు?"

"మీతో కలిసి ఇలా వచ్చినందుకు."

"అయితే నిన్ను చూస్తే కోపం కూడా వస్తోంది"

"కోపమా?" అంది హడలిపోతూ.

"అవును. నాకింత తేలిగ్గా చనువిచ్చినందుకు"

"ఓ! అదా!" అంది ఎస్మరాల్డా ఊపిరి తీసుకుని. "నాకూ తెలుసు, నేను పెట్టుకున్న ఒట్టు తప్పుతున్నానని ఇంక నాతల్లిదండ్రుల్ని చూసే ఆశ పోతుందనీ తెలుసును. తాయెత్తులో మహాత్తు పోతుంది. కాని పరవాలేదని మీకోసం వచ్చేశాను. ఇంక నాకు తల్లీ తండ్రీ అక్కర లేదనుకున్నాను. మీకోసం......" అంటూ ఆమె తలెత్తి ఫీబస్ ముఖంలోకి చూసింది.

"నువ్వు చెప్తున్న దేమిటో నాకర్థంకావడంలేదు."

ఎస్మరాల్డా కొంతసేపు మౌనంగా ఊరుకుంది. ఆమె కనుకొలకుల్లో నీరు నిలిచింది. దీర్ఘ నిశ్వాసం విడిచింది.

"మీకోసం ఏదైనా వొదులుకుంటాను. మీకు నా హృదయం అర్పిస్తున్నాను."

ఆమె వర్చస్సులోనే పవిత్రశీలం ఉట్టిపడుతూ వుంటుంది.

# ఘంటారావం

శీలమంటే ఏమిటో ఎరగని ఫీబస్‌కి ఆమె సమక్షంలో జంకు పుట్టింది. ఆమె ఈ మాటలు వినగానే అతనికి కొంచెం ధైర్యం చిక్కింది. మెల్లిగా ఆమెపై చెయ్యివేసి "అయితే! నన్ను నువ్వు ప్రేమిస్తున్నావన్నమాట!"

మెల్లిగా అతని చెయ్యి తొలగిస్తూ ఎమరాల్డా ఇలా అంది. "ఫీబస్! మీరు ఎంతో మంచివారు. చాల చక్కనివారు. నన్ను రక్షించారు. దిక్కులేనిదాన్ని నేను. మిమ్మల్ని గురించి ఎన్నెన్నో కలలు కన్నాను. మీవంటి వీరునిగురించే కలలు కన్నాను. ఏదీ మీ కత్తి? చూపండి."

"చిత్రమైనదానవు" అంటూ ఫీబస్ ఒరలోనుంచి కత్తి తీశాడు. ఆమె కత్తి పిడి పరిశీలించింది. కత్తి పదునుచూసింది. మెల్లిగా కత్తి ఎత్తి ముద్దుపెట్టుకుంది. ఆమె తల వంచిన అవకాశం చూసుకుని అతడామె తెల్లని మెడపై మృదువుగా చుంబించాడు. ఆమె ఉలిక్కిపడింది. ముఖం ఎర్రబడింది. చీకటిలో క్లాడ్ పళ్లు పటపట కొరికాడు.

"కాప్టెన్ ఫీబస్! నామాట ఒకసారి వినండి." ఫీబస్ తమకం అణుచుకోలేకున్నాడు. మరింత దగ్గరకు జరిగాడు. అతని పెదిమలపై ఆమె వేలుంచి వారించింది. "ఆగండి. నిజం చెప్పండి. నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?"

"ప్రేమిస్తున్నావా అని అడుగుతున్నావా?" అన్నాడు, ఫీబస్ లేచి ఆమె ముందు మోకరించాడు. "నిన్ను తప్ప ఇంకెవరినీ ఇంతవరకూ ప్రేమించనేలేదు" అన్నాడు.

అతని నోటివెంట ఈ మాటలు సులువుగా వచ్చాయి. ఈ మాటలు చాలమందివద్ద అన్నాడు. అభ్యాసంవల్ల మాటలు తడబడకుండా స్పష్టంగా వచ్చాయి.

ఎమరాల్డా ఆనందంతో పరవశురాలయింది. తళతళలాడుతున్న కన్ను లెత్తి కిటికీలోనుంచి చంద్రునివంక చూసింది.

"అబ్బ! ఇంత ఆనందంలో ప్రాణం ఒక్కసారి అంతరించిపోతే ఎంత బాగుండును!" అంది. అదే అదననుకున్నాడు ఫీబస్. మరొకసారి ఆమెను చుంబించాడు. చీకటిగదిలో క్లాడ్ క్రోధావేశంతో కంపించిపోయాడు.

"ప్రాణం పోవడమా!" అన్నాడు కాప్టెన్ ఫీబస్. "ఏమిటి మాట్లాడుతున్నావు? బ్రతికి సౌఖ్యం చవిచూడవలసిన సమయంలో చావు గురించి ఆలోచిస్తున్నావా? అబ్బేబ్బే! అలా కాదు. నా మాట విను...అరె! నీ పేరు ఎంత ప్రయత్నించినా నోరుపట్టకుండా ఉంది. విచిత్రమైన పేరు."

"ఎంతో చక్కని పేరనుకున్నాను. కాని మీ కిష్టం లేకపోతే మీరే చెప్పండి, ఏ పేరు పెట్టుకోమంటారో. ఏదైనా సరే మీ కిష్టమైనదే నా కిష్టం."

"అబ్బే! అవి అంత ముఖ్యమైన విషయాలు కావులే. ఆ పేరే అలవాటౌతుంది. ఫరవాలేదు. నిజం చెప్తున్నాను. నువ్వు నా కంటికొక దేవతవు; అప్సరసవు. నిన్నెంత గాఢంగా ప్రేమిస్తున్నానో ముందు ముందు నీకే తెలుస్తుంది. నిన్ను అందలమెక్కిస్తాను. నాకింద ఉండే సైనికులందర్నీ నీకు సేవకులుగా నియోగిస్తాను. వాళ్లందరికీ చక్కని గుర్రాలున్నాయి. గుర్రాలమీద వచ్చి వాళ్లు నీకు వందనంచేస్తారు. యేడాదికొకసారి జాతీయ సైన్యాలన్నీ మైదానంలో చేరి రాజుగారిపట్ల భక్తి ప్రకటిస్తాయి. అప్పుడా సైనికవిన్యాసాలెంత అద్భుతంగా ఉంటాయో తెలుసా? అక్కడ అధికారులందరిమధ్యా నిన్ను కూర్చోబెడతాను. నువ్వే స్వయంగా చూద్దువుగాని."

కాప్టెన్ ప్రగల్భాలన్నిటినీ ఆమె చెవులొగ్గి వింది. ఆమె ఏ ఊహాప్రపంచంలో విహరిస్తోందో తెలియదు; ఆమె కన్నులలో స్వప్నప్రపంచాలు మెరుస్తున్నాయి.

"నువ్వు మహారాణికంటె ఎక్కువ వైభవంతో వెలిగిపోతావు తెలుసునా?" అంటూ ఆమె భుజాలు పట్టుకుని దగ్గరకు లాక్కోబోయాడు. ఆమె కలలనుంచి ఉలిక్కిపడి మేలుకుంది. దూరంగా జరిగింది.

"అబ్బే! ఏం లేదు. ఈ దుస్తులు బొత్తిగా బాగుండలేదు. నాగరికుల దుస్తులు వేసుకుంటే ఇంకెంత అందంగా ఉంటావో ఊహిస్తున్నాను. అంతే!" అన్నాడు కాప్టెన్.

"అప్పుడే కాదు. ఫీబస్! నాకు మీ మతం నేర్పుతారా?"

"మతమా? నా మతంతో నీకేం పని?"

"మనం పెళ్ళి చేసుకోవద్దా?"

ఫీబస్ ఆశ్చర్యపడ్డాడు. అతని ముఖంలో కొంత నిరసన కూడా తొంగిచూడకపోలేదు. ఆమెవంక ఒకసారి చూసి అన్నాడు.

"మనకి పెళ్ళి కూడా ఎందుకు?"

ఈ మాట వినేసరికి ఎమరాల్డా ముఖం పాలిపోయింది. పెదవులు వణికాయి. తల వంచుకుంది.

ఫీబస్ అనునయిస్తూ ఇలా అన్నాడు: "నిజంగా మనకి పెళ్ళెందుకో నువ్వే చెప్పు. చర్చిలో ఫాదరీముందు నిలబడి అర్థం తెలియని లాటిన్ మాటలేవో బడబడ వాగేస్తే, అదొక పెళ్ళా? అటువంటి పెళ్ళి జరిగితేం, జరక్కపోతేం; మనకేం లోటు?"

క్లాడ్ ప్రోలో అంతా అతి జాగ్రత్తగా గమనిస్తున్నాడు. వారి సంభాషణ ఒక్క మాటైనా పొల్లుపోకుండా వింటున్నాడు. విని క్రోధంతో వొణికిపోతున్నాడు. ఆ పరిస్థితిలో అతన్ని చూస్తే, బోనులో బంధించబడిన బెబ్బులి లేడిని చూసిన దృశ్యం గుర్తుకు వస్తుంది. అతని కళ్లు మంటలూడుతున్నాయి.

ఉన్నట్టుండి ఫీబస్ యువతి పైఉత్తరీయం లాగివేశాడు. ఆమె ఒక్క ఉదుటున లేచి నిలబడింది. అతనివంక భీతితో చూసి వెనక్కి ఒకడుగు వేసింది. ఈమారు స్ఫటికంవలె మెరుస్తున్న ఆమె భుజాలవంక తమకంతో చూశాడు ఫీబస్. ఆమె తన భుజాలను చేతులతో కప్పుకుంది. నోటమాటలేక సిగ్గుతో శిరస్సు వాల్చి ఉన్న యువతి లజ్జ మూర్తీభవించినట్లుంది. ఆమె కంఠంలో హారమూ, సంచీ బయటపడినాయి.

"అదేమిటి?" అని అడుగుతూ, అది సాకుగా ఆమెను సమీపించాడు ఫీబస్.

"ఆ! ఆ! అది ముట్టుకోవద్దు"అని ఆమె దీనంగా బ్రతిమాలుకుంది. "అది నా శీలం చెడకుండా ఉంటే, అదే నన్ను నా తలిదండ్రుల దగ్గరకు చేర్చుతుంది. కాప్టెన్. నన్ను విడిచిపెట్టండి. మిమ్మల్ని పాదాలంటి ప్రార్థిస్తున్నాను. పాపం! మా అమ్మ! నాకోసం ఎంత తపించి పోతోందో! ఫీబస్! నా పైగుడ్డ ఇచ్చెయ్యండి. నన్ను రక్షించండి" అని దీనంగా ప్రార్థించింది.

ఫీబస్‌కి విసుగుపుట్టింది. నిస్పృహతో వెనక్కి రెండడుగులేశాడు. "నీకు నా పైన ప్రేమలేదు. తెలుస్తోనే వుంది" అన్నాడు.

(55-వ పేజీ చూడండి)

పెద్దకథ

# వీరులూ-వారసులూ

### శ్రీ మునిపల్లె రాజు

(గత సంచిక తరువాయి)

## 9

శోభనాచలం కూతురు సావిత్రిని సత్యానికిచ్చి పెళ్లిచేద్దామన్న నిశ్చయం ఏనాడో జరిగింది. కాని సత్యం పట్టుదలవలనే ఆమంచి "ఘడియ నెట్టుకురాలేదు." సంఘాల్లో, మీటింగుల్లో, ఆకలియాత్రల్లో అతని కాలమంతా లెక్కకురావటం లేదు. అన్నింటినీ మించిన పెద్దఅభ్యంతరంగూడా సత్యం పుట్టించిందే. "పూలదండలు మార్చుకోటమే మా పెళ్ళి. అందుకు పెద్దలు వప్పుకొన్నదాకా మేమూ భీష్మించుకు కూర్చుంటాం"—అని సత్యం పట్టుబట్టాడు. ఇటు శోభనాచలం, అటు అమరయ్య యీ హరాత్ విప్లవానికి తయారుగాలేరు. కాలం మారిందని, డబ్బు విలువ తలక్రిందులైందని వాళ్ళకు తెలియక గాదు. కరువుదేవత గ్రామదేవతకు బదులు సావిడీలో కాపలా కాచి కాపురం చేస్తున్నా, నెత్తికిమించిన బరువుభరించిన తరతరాలనాటి ఆచారాలకు, ఇంతటి అపవాదునుగూడా భరించలేక సమాజానికి అడుగడుగునా భయపడే మనస్తత్వానికీ, పూర్వులు గీచిన గడిలో గృహకార్యాలు జరిగించకపోతే దేవతలకు కోపంవస్తుందన్న పాపభీతికీ— దాసులైన పెద్దలు సత్యంపట్టుదలకు లొంగిరాలేదు. "ఉడుకురక్తం" "పిల్లవేషం" అన్నారు. సావిత్రి కలలు కలలుగానే నిలిచిపోయినవి.

మంచం వాల్చుకుని కోటిలింగం చీకట్లో పడుకొనివున్నాడు. గృహజీవితంతో అతనికి పూర్తిగా సంబంధం తెగిపోయినట్లే వ్యవహరిస్తున్నాడు. వ్యవసాయకూలిపని అనుభవమైన రోజునుండీ, ఇంట్లో తిండిగింజలు లేవన్న సంగతి, తాయారమ్మ వుపవాసాలతో సగమై కళ్లల్లో ప్రాణం నిలుపుకొన్న సంగతి, బిడ్డల్ని పోషించలేక మామగారింటికి పంపాడని తనవాళ్ళు తనను గూర్చి అన్న సానుభూతి వాక్యాలసంగతి-వీటన్నింటికీ అతను అతీతుడైపోయినట్లున్నాడు. నిజానికి తన మామ అంత హఠాత్తుగా ఎందుకు వచ్చాడో అతనికి తెలియదు. వచ్చి - "పిల్లల్ని నాతో పంపు. ఈ నాలుగునెల్లూ అక్కడే వుంటార్లే" అన్నాడు. తనకు పట్టనట్లు వూరుకొన్నాడు. తాయారమ్మే పిల్లల్నందర్నీ ప్రయాణం చేయించి, తండ్రితో అంపించేసింది. చివరకు కోటిలింగంసమ్మతిని గూడా అడగలేదు.

చీకట్లో అత నేమాలోచిస్తున్నాడో అతనికే తెలియదు. తనే అనిత్యమనో? లేక కొండలవలె సముద్రాలవలె ఈ చీకటీ, మానవుడి ఆకలీ, చుట్టూ వ్యాపించివున్న విషాదం, విషవాతావరణం నిత్యమైనవనో? ఇంట్లో తాయారమ్మ ఏమిచేస్తున్నదో గూడా అతను కనుక్కోలేదు. తనభార్య అనేవ్యక్తి అస్తిత్వాన్నిగూడా అతను స్మృతికి తెచ్చుకో ప్రయత్నించుకోలేదు.

చీకట్లో, నెమ్మదిగా వచ్చిన సావిత్రి ముఖంమీద కప్పుకొన్న పమిటె చెంగు తొలగించుకొని తన కెదురుగా నిలబడి - "అన్నా!" అని పిలిచింది ఆ పిలుపుతో అతను లోకంలోకి మరలివచ్చాడు.

"అంతేనా? ఇందరూ వుండి బావకు జైలు గతేనా? ఏం తప్పు జేశాడని? తన కోసం గాదుగా, ఏం జేసినా? ఎవరికివాళ్లు తప్పుకుపోతే నాగతేంగాను?"

సావిత్రిమాటలు హృదయంలోనికి చొచ్చుకుపోయినవి యుగయుగాలుగా మహాప్రళయాలలో గూడా అచంచలమై నిలిచిన మహామేరువు, దీనులైన ప్రజలు విడిచిపోయిన పసిగుండు ఆర్తనాదానికి ఒక్కసారి కరిగి, ప్రవహించినట్లయింది కోటిలింగం దిగ్గున మంచం దిగినాడు. సావిత్రి ముఖంవంక తేరిపారజూచినాడు. ఇంట్లో గాని, బయట గాని, మగ్గం గుంట దగ్గరగాని దీపం లేదు. చీకట్లో మిణుగురు పురుగులవలె అతని కళ్ళు ఆ దీనురాలివంక జూచినవి.

"సాక్షులు దొరికితే బావకేసు పోతుందని శ్రీరాములుగారంటున్నారు. నువ్వొక సాక్షివి. నేనొకదాన్ని."

ఈ సంగతి తన కింతవరకూ తట్టలేదు సావిత్రి చీకట్లో పెదవులు వణకుతూ మాట్లాడింది. ఈమాటు ఆమెవంక చూడలేకపోయాడు.

"ఇకపోతే ప్లీడర్ని పెట్టాలిట. ఒక యాభై దొరికితే రెండు మూడు వాయిదాలదాకా ఏమీ పరవాలేదని శ్రీరాములుగారు చెప్పారు" అని సావిత్రి ముగించింది.

భక్త రామదాసు ప్రార్థన విని తానీషాకు చెల్లించిన రామలక్ష్మణులు అతనికి మనోగోచరమైనారు చీకట్లో సావిత్రి నిలిచివుంది తన జవాబుకోసం.

ఆమె కదలికలేని చెక్కడపు బొమ్మవలె తిరిగి మాట్లాడలేదు. ఆమెలో రామానుజయ్య కనిపించాడు. ఆనాటి రామానుజయ్యమానానికీ తనముందు దేవతవలె నిలిచి కర్తవ్యప్రబోధం చేస్తున్న సావిత్రి మానానికీ సారూప్యం గోచరించింది. మరుక్షణంలో అతన్ని ఆనాటి భయం ఆవేశించింది. గజగజవణకిపోయి, కూలిమంచంలో కూలబడ్డాడు.

"అ...న్నా...!" అని ముందుకు వంగి, సావిత్రి పెద్దగా అరిచింది. ఆ అరుపుకు యింట్లో తాయారమ్మ పరుగెత్తుకువచ్చి— "మీ అన్నకు వంట్లోనూ, మనసులోనూ బాగుంటంలేదులే" అని సావిత్రిమీద చెయ్యివేసింది.

* * *

పూనికవచ్చి పరమాత్ముని దర్శనంలో లీనమైన భక్తునివలె కోటిలింగం ఒకగంటవరకూ, మంచంలోనే పడివున్నాడు. కలలో, ఎవరో దేవత, ఏవో దూరలోకాల నుండి మేఘమాలికలమీద పయనించివచ్చి తనకు జీవితసందేశాన్నందించి, కనుతెరిచినంతలోనే మాయమైపోయింది. కన్నీళ్లు కార్చక, అధైర్యపడక, అబలగాక తన ముందు నిలిచి, జ్ఞానోపదేశంజేసినది—తన కళ్ళముందు పెరిగి పరికిణీకట్టి, సిగ్గుతో సత్యాన్ని క్రీగంటజూచి శోభనాచలం యింట్లోకి పరుగెత్తే చిన్న సావిత్రేనా? ఈ సావిత్రిని తనెప్పుడూ చూడలేదు.

కమ్మరి కొలిమిలో కాలికాలి వుష్ణోగ్రతలోగూడా తన సహజశక్తిని కోల్పోని వుక్కుకడ్డీవలె, ఛట్టున మంచంమీదనించి లేచి నిలబడ్డాడు. ఇందాక వచ్చిన భయాందోళ

# ★ వీరులూ, వారసులూ ★

లు; బలహీనతకు బదులు, పూర్వశక్తితో అతని మెదడు పనిజేయసాగింది. సత్యం జైలునుంచి బయటకు రావాలి. లీడరుకు యాభై రూపాయలు కావాలి.

ఎక్కడున్నై యాభై రూపాయలు? సత్యాన్ని జైల్లో పెట్టించిన భారతమ్మ ఇంట్లో లేవా?

రాత్రి పన్నెండు దాటినది. వరండాలోనుండి కనబడే శ్మశానంలో కొరివి దయ్యాల నృత్యం ప్రారంభమయింది. స్వార్థలోకంలో వేదాంతి హితవచనాలవలె, నిశీధిని చీల్చుతూ వూరకుక్కలు వ్యర్థంగా మొరుగుతున్నవి. కోటిలింగం బయటకు వచ్చి నాలుగడుగులు వేసి, ఏదో మరిచిపోయినట్లు తిరిగి యింట్లోకి వెళ్ళి చేతులారా నాశనం చేసిన మగ్గంగుంటమీది మొద్దుకత్తి తీసుకొని బొడ్లో దోపుకొని, పైన పాత పంచె కప్పుకొని బయలుదేరాడు. అడుగడుగు వేసుకొంటూ, ప్రపంచంలో హంతకుల మార్గం బహు సులభమైనట్లుగా దిక్కులుగూడా చూడకుండా, హుటాహుటిని నడకసాగించాడు.

లోకంతోపాటు శ్రీరాములుగారి యిల్లుగూడా, పాత హిందూసామ్రాజ్యాల రాజధానిలో శిథిలంవలె, కుప్పగా, ముద్దగా, చీకట్లో ఆకారంలేక నిద్రిస్తున్నది అతని కాళ్ళు చటుక్కున ఆగినవి. ద్వారం సందులగుండా మిణుకుమిణుకుమని గుడ్డికాంతి కన్పిస్తున్నది. "శ్రీరాములుగారూ!" — అని పిలువబోయినంతగా అతని పెదిమలు ప్రయత్నించినవి.

శ్రీరాములుగారి ఇంటిదగ్గర మలుపు తిరిగింతర్వాత ఎవరో యిద్దరు మనుషులు చుట్టలు కాల్చుకుంటూ, అతని కెదురొచ్చారు. అందులో ఒకడు — "ఎవరా పోయేది?" అని గట్టిగా అడిగాడు. కోటిలింగం బదులుచెప్పక ముందుకు సాగాడు. రెండోమనిషి దగ్గిరగా వచ్చి చూచి— "నువ్వటయ్యా! కోటిలింగం? పిలిస్తే పలకవేం—" అని తేల్చిపాకేసి రెండోవాడితో కలిసి వెళ్ళిపోయాడు. అక్కడే కోటిలింగం కత్తి కిందకు జారిపడ్డది. తిరిగి తీసుకొని, యిక ఆలోచనలేకుండా కోటిలింగం కళ్ళుతెరిచి చూచినాడు. తాను భారతమ్మ యింటిముందు నిల్చొని వున్నాడు. ఎంతలో!

భారతమ్మకు భర్తలేదు. కాని కొద్దో గొప్పో ఆస్తివున్నది. ఆమెను కనిపెట్టుకొన్న ఒక ముసలమ్మ ఆమె వున్నారు— కొంపలో. ఈ ఇల్లు కొత్తగా కట్టించింది భారతమ్మ - చిన్న బంగళాలాగా. కోటిలింగం ఒకక్షణం నిల్చి ఆలోచించి, గోడదూకి లోపల కాలుపెట్టాడు. చుట్టూ తిరిగి లైటువస్తూన్న కిటికీముందుకెళ్ళి, తను కనబడకుండా వంగి మెల్లగా సందులలోనుండి తొంగిచూచాడు.

ఒకరెప్పపాటు కోటిలింగం తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు. తిరిగి జాగ్రత్తగా కళ్ళు నులుముకొని చూశాడు. ఆ గదిలో భారతమ్మ ఒక్కతేగాదు వున్నది; ఆమెతోబాటు సుబ్బారావుగూడా వున్నాడు. ఆ వూరి శృంగారపురుషుడు సుబ్బారావు. భారతమ్మ తమలపాకులు చీల్చి అతని నోట్లో కుక్కుతున్నది. కోటిలింగానికేమి చేయాలో తోచలేదు. సభల్లో, రచ్చల్లో పెత్తందారుగా, సంఘసేవకురాలుగా చలామణీ అవుతున్న భారతమ్మరహస్యజీవనం అతని కళ్ళముందున్న దాక్షణంలో; పొట్టవిచ్చుకొని నేలగూలిన మేడిపండువలె!!

జుగుప్సతో అతనా కిటికీనుండి కదిలాడు. వెనుకకు మరలాడు, కాని, సావిత్రి ముందువచ్చి నిలిచినట్లయినది. పిరికితన మనుకొన్నాడు. లలాటంమీద కమ్మిన స్వేదం తుడుచుకొని తిరిగి ముందుకొచ్చాడు. అతనికి పిచ్చిఆవేశం వచ్చింది పోయి గబగబా తలుపు కుద్దాడు.

సుబ్బారావును చూడగానే అతని వళ్ళు జలదరించింది. సంఘంలో యీ బలాదూర్ వ్యక్తికే ఘనతా, ప్రాధాన్యం లేదు. అప్పటికే రెండు మూడు యిళ్ళు కూల్చాడు. చదువుసంధ్యలు నడమంత్రంగానే ఆగిపోయినవి. కారుడ్రైవర్లతోనూ, చీట్లపేక ఆటే ప్రధానంగా పెట్టుకొని జీవితాన్ని గడిపే పచ్చి బడుద్ధాయీలతోనూ కాలక్షేపంచేసి, రౌడీజట్టు పెంచుకొని, చేతిలో సిగిరెట్టు టిన్నూ, గూడకట్టూ, సిల్కు కళ్ళీల లాల్చీతో తిరిగే యీ బేవార్సును - యిదివరలో తనెప్పుడూ కన్నెత్తి గూడా చూడలేదు.

మలాన్ రంగుజాతి అసూయతను ద్వేషించే భారతీయ విజ్ఞానులు తమ స్వగ్రామాలవంక ఒకసారి చూసుకోవాలి. సుబ్బారావు ఆర్పినయిళ్ళన్నీ మైనారటీకులాలకు చెందినవి. సుబ్బారావుది మెజారిటీకులం, వూళ్ళో అతనిమీద అసహ్యం వున్నా, అది ఆచరణలేని సిద్ధాంతం మాత్రమే అయింది.

కోటిలింగానికి ఆపాదమస్తకమూ ఒక అగ్ని ప్రసరించింది. సత్యంవంటి వుత్తమ మానవుడు - నాలుగు గోడలమధ్య మగ్గుతూండగా, యీ పెత్తందారీ కొత్త భాగ్యవంతులు పట్టించుకోలేదు. కాని యీ మిల్లర్లు, దేశవాళీనాటు పెట్టుబడి వల్లెవాటుదార్లను స్వేచ్ఛగా వదిలివేశారు. ద్వేషంతో, క్రోధంతో కోటిలింగం తూలిపోయాడు. ఈ పాపాలే ఏ తక్కువ బలంగల కులంవాళ్ళు చేస్తేనో? బుర్రమీసాలు తిప్పుకొని, ధనంతో మదించి, చుట్టలు మార్చినట్లుగా పార్టీలను, నాయకులను మార్చి, పర్మిట్లకోసం ఎగబడే దౌర్జన్యపూరితులైన ఈ పెత్తందార్లందరూ, తమ కలహాలు, ద్వేషాలూ మరిచిపోయి ఏకంగారా? అవుతారు. ఎన్నిసార్లు తనీ ఘోర నిరంకుశాన్నిదివరలో చూడలేదు? ఇంకెన్నిసార్లు చూడనున్నాడు?

"భారతమ్మా! భారతమ్మా!!"

లోపలి అదిరిపాటు, దొడ్డితలుపు తెరుచుకొని తిరిగి మూసుకొనటం, ఆ తరవాత తొట్రుపాటు, ఆపిమ్మట - "ఎవరు?" అన్న ప్రశ్న కోటిలింగం విన్నాడు - మండిపోయి—

"నేను!"అని కాలిపోతూ పెద్దస్వరంతో జవాబిచ్చేడు. అంత పెద్దగొంతు ఆవశ్యకత లేనేలేదు.

"నేనంటే ఎవరు? అర్ధరాత్రివేళ పేరైనా చెప్పకుండా?"

---

ప్రక్కింటి అబ్బాయి:— "ఏమండీ! ఈ రాత్రికి మీ గ్రామఫోను ఇస్తారేమో మా నాన్నగారు కనుక్కోరమ్మన్నారండి?

ఇంటియజమాని:—"చుట్టాలుగాని ఎవరైనా వస్తున్నారా ఏమిటి?"

"ఆ, లేదండి, ఈరాత్రి నాన్నగారు నిద్రపోవాలనుకుంటున్నారండీ!"

—"రాధాకృష్ణమూర్తి"

---

విద్వేషాగ్ని మరోకసారి ప్రజ్వరిల్లింది. ఆ శిఖలనుండి అతని తప్త స్వరం భయంకరంగా వినవచ్చింది.

"కోటిలింగం—కోటిలింగం."

మరో క్షణంలో ముసలమ్మ లాంతరు చేతబట్టుకువచ్చి తలుపు తీసింది. ఆమె వెనకనే భారతమ్మ వుంది. విస్ఫులింగాలవంటి కళ్ళతో, ఆ కులటను కాల్చేటట్లు కొది క్షణాలు కోటిలింగం తదేకదీక్షతో చూచినాడు. ముసలమ్మ నోరు చేసుకోబోతుండగా అతనే అన్నాడు కోపంతో వణికిపోతూ—"సుబ్బారావేడీ?"

భారతమ్మ దిగాలుపడ్డది. ఆ తెల్ల చీర, మల్లెపూల సింగారంనుండి నెత్తురుచుక్క లేని ముఖం ఆందోళనతో అతనివంక చూచింది. ఇక తన మర్యాద దక్కదనుకొన్నదేమో, ముసలమ్మను వెళ్లి పడుకోమని పంపించేసింది. అప్పటికి సంబాళించుకొని, అమాయికత్వం తెచ్చుకొని—"ఏ సుబ్బారావు?"

"ఏ సుబ్బారావో ఎందుకుంటాడిక్కడ? నీ సుబ్బారావు నీవు తమలపాకులు నోట కుక్కావే, వాడు. నేను తలుపు తట్టగానే దొడ్డిదోవ చూపించిన సుబ్బారావు. మాట్లాడవేం...?"

ముసలమ్మ యీకరుకు సంభాషణ విని తిరిగివచ్చింది. కోటిలింగంతడుముకోకుండా బొడ్లోనుండి మొండికత్తితీసి ముసలమ్మవంక చూశాడు. భారతమ్మకు నోటమాటరాక వెనకకు ఒక అడుగేసింది. వేసి ముసలమ్మను తిరిగి లోపలికి తోసివచ్చి దూరంగా నుంచొన్నది. తిరిగి కోటిలింగం పళ్ళు కొరుకుతూ, ద్వేషం వలికిస్తూ మాట్లాడాడు.

"మోసకత్తెవు, కులటవు. సత్యంవుంటే గంజికేంద్రంలో నీ ఆటలు సాగవని జైల్లో తోక్కించావు. నీబదుకు ఒక్క క్షణంలో రచ్చపాలు చేయగలను. రేపటి వాపుకు నీ పేరు నలుగురినోట్లో నానుతుంది. నీ జీవానికి బడి యేడుస్తున్నది యింకో ఆడపిల్ల. సత్యం జైల్లోనుంచి బయటకు రాకపోవాలి నీ బదుకు బయలుచేస్తాను. జాగ్రత్త కళ్ళు తెలిసి మసులుకో. నాకు ప్రాణంమీద ఆశ లేదు. సత్యంకోసం నీ రక్తం యేరుచేస్తా... తెలిసి మసులు"

భారతమ్మ వణికిపోయింది. ఒక వంక గౌరవం; ఒకవంక తన ప్రాణం. కళ్ళనీళ్ళు తిరిగినాయి. ఆ పరిస్థితుల్లో స్త్రీ ఏమిచేయాలో ఆదే చేసింది. కోటిలింగం తను వచ్చినపని మరిచి ద్వేషపు సుడిగుండంలో చుట్లు చుట్టుకపోతున్నాడు.

భారతమ్మకు ఒకక్షణం వ్యవధిదొరికింది తన గదిలోకిపోయి తిరిగివచ్చి, కోటిలింగం చేతుల్లో యున్ని నోట్లపొత్తూ—"అయిదు వందలు. నా మర్యాద కాపాడు. నీతో బుట్టినదాన్ననుకో కోటిలింగం. సత్యంమీద కేసు, సాక్ష్యంచెప్పను. కేసుకు ఎంతయితే అంత ఖర్చుపెట్టిస్తాను. ఈ సంగతి మరిచిపో. ఇంకో ప్రాణికి పొక్కవద్దు యివి చేతులు గావు నీతోడబుట్టినదాన్ని..." అని వలవలా ఏడ్చింది.

## ★ వీరులూ - వారసులూ ★

కోటిలింగం నోట్లు తీసుకొన్నాడు. లెక్కపెట్టాలన్న బుద్ధిగూడా పుట్టింది. ఒక్కక్షణం వాటివంక చూశాడు. అతనికి మరుక్షణంలో, గుప్పిట బిగించి నోట్లు



నలిపి, ఆవేశపూరితుడై - భారతమ్మ ముఖాన విసిరికొట్టి - "అయిదు వందలు - హూ! ఎవరిని కొనదలచుకొన్నావ్, నీ అయిదు వందలతో. నన్నా? సత్యాన్నా?" అన్నాడు. అతని కళ్ళనిండా నీరు నిలిచింది. ప్రళయంలో ఝంఝామారుతానికి గూడా చలించని చెట్టువలె అతడు నిలబడ్డాడు. అతని దేహంలోని గ్రంధులన్నీ విద్వేషరసాన్ని స్రవించినట్లుగా అతని ముఖం కోపోద్రేకంతో వరుసగా ఎర్రనై, నల్లనైనది. అతని కళ్ళముందు రామానుజయ్య, శ్రీరాములు, సత్యం నిలిచివున్నారు.

కోటిలింగం, మరి మాటాడక విసవిసా నడిచి వెళ్ళిపోయాడు. భారతమ్మ నిశ్చేష్టురాలైనది. తెల్లవారు ఝామున కోళ్ళు కూసినవి.

## 10

కోటిలింగం ఇల్లు చేరేటప్పటికి మసకచీకట్లో అతని రాకకై తాయారమ్మ ఎదురుచూస్తున్నది.

"ఎక్కడికి వెళ్ళావో యేమో! శ్రీరాములుగారు మనిషిని పంపించారు నీకోసం."

కోటిలింగం బొడ్లో పెద్దకత్తి తీసి ఆమెవంక ప్రశాంతవదనంతో ఒక్క క్షణం కళ్ళు నిలిపాడు. భారతమ్మ యింటినుండి తిరిగి వచ్చేటప్పుడు తను శ్రీరాములుగారి యిల్లు తప్పించి వచ్చాడు. తను రాత్రి చేయబోయిన నీచకార్యాన్ని దూరదృష్టితో తెలుసుకొని, తనకు మరొకసారి దివ్యజ్ఞానాన్ని ప్రసాదించేందుకేమో శ్రీరాములుగారి యీ పిలుపు? లేక సత్యం కేసు వాయిదా రేపేగదా? దానికోసం శ్రీరాములుగారు పిలువనంపుతున్నారో? లేక తనకు కర్తవ్యం ప్రబోధించిన సావిత్రి శ్రీరాములుగారిని గూడా వేడుకొన్నదేమో? లేక స్వరాజ్య పోరాటంలో వీరుడివనీ, రామరాజ్యానికి వారసుడవనీ తిరిగి తన స్మృతికి తెచ్చేందుకు యిది పిలుపేమో? రాత్రివిషయం వూరంతా అప్పుడే గుప్పుమన్నదా? అయితే కానీ! ఈ లోకమంతా ఒక్కటై వచ్చినా, తను నిలవగలడు. అవకాశవాదులు, మిల్లర్లు, కులవాదులు, మదాంధులైన భూస్వాములు, చీకటి బజారు వ్యాపారులు, రౌడీలు, దోపిడిముఠాలు వీరే లోకమైనప్పుడు—తనూ, రామానుజయ్య, శ్రీరాములూ, సత్యం దేవతలైపోగలరు—ఆ దైత్యలోకం ముందు.

కోటిలింగం తన కళ్లతో లోకాన్నంతా తృణప్రాయంగా చూచి, శ్రీరాములుగారింటికి బయలుదేరాడు.

శ్రీరాములుగారి తల్లి శుష్కించిన దేహం

ప్రేతంవలె కళలేక చావుకు నిరీక్షిస్తూ ఆముదపు దీపం వెలుగులో కనబడ్డది. ఆమె కుక్కిమంచంపక్కనే శ్రీరాములుగారు, ఒక పాతపెట్టెమీద కూర్చొని ఆమెకు ప్రాణమైన గీతాపారాయణం చేస్తున్నారు. ఆగది చుట్టూ కలియజూచాడు కోటిలింగం. పైనుండి నల్లనిబూజు తుట్టెలు తుట్టెలుగా, దారిద్ర్యపిశాచిజడలవలె వ్రేలాడుతున్నది. చిలుముబట్టిన ఒక ఇత్తడి గ్లాసూ, దానిప్రక్కన మూతివిరిగిన ఒక పాతకూజా, పేడఅచ్చులు వూడిన పాటిమట్టిగోడకు ఒక దణ్ణెం, దానిమీద ఒక్కటేపాతగుడ్డ. మంచంమీద నున్న శ్రీరాములుగారివైపు చూచాడు, ఒకటికి రెండుసార్లు. ఆ గదిలో మృత్యుదేవత గోడలై, యింటికప్పె తానుగా నలుముఖాలకు తన విషపునవ్వును వ్యాపింపచేసి దాగివున్నది. మృత్యుదేవతకు ఒక ఆకారం కల్పించి ఆ వంకకు తిరిగాడు కోటిలింగం. శ్రీరాములుగారు శ్లోకాలు చదువుతూనే వున్నారు— "యదా యదాహి ధర్మస్య, గ్లానిర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్, పరిత్రాణాయ సాధూనాం... వినాశాయ చ దుష్కృతామ్......"

మంచంలో వృద్ధురాలు యివి వింటున్నదో లేదో కోటిలింగానికి తెలియలేదు. ఆ గదినిండా విషాదం గాలి గామూరి స్తంభించివున్నది

కోటిలింగం వచ్చినతర్వాత శ్రీరాములుగారు ఒకసారి తలెత్తిచూసినా అతన్ని పలకరించలేదు. కోటిలింగం ఆయన సరసనే కూచొని, తల్లి బతికివుండగా మంచి తిండీ మందులు పెట్టి సుఖింపజేయలేకపోయినా ఆమె అవసానదశలో గీతాపారాయణంతో ఋణవిముక్తి చేసుకొంటున్న ఆ దేశభక్తుడిలో లీనమైపోయినాడు. చిత్రంగా కోటిలింగానికి గూడా మృత్యువుమీదే ఆలోచనలు పోలేదు. మృత్యువు తరవాత ఏమిటి? రామానుజయ్య కాలజ్ఞానం చదివి చెప్పిన ముక్కలు స్మృతికి వచ్చినవి, గాని వాటిని వెంటనే మరిచిపో ప్రయత్నించాడు. తన బిడ్డలమీద మమత మళ్లింది. రామానుజయ్యా, అమరయ్యా రామనవమి గడచిపోయి పక్షం రోజులైనా యింకా తిరిగి రాలేదేమా - అన్న ఆందోళన గలిగినది. తను సావిత్రికి ఏమని సమాధానం చెప్పాలి? రాత్రి భారతమ్మ డబ్బు తిరస్కరించి, సత్యాన్ని తను అన్యాయం చెయ్యటంలేదా? ఈ పరిస్థితిలో శ్రీరాములుగారి సలహా తనేమి పొందగలడు?

హఠాత్తుగా శ్రీరాములుగారి పఠనం ఆగిపోయింది. ఇనుమడించిన దిగులుతో కోటిలింగం తిరిగి మృత్యుదేవత సన్నిధికి వచ్చిపడ్డాడు.

"మహాతల్లి తన కష్టాలు విరగడచేసుకొని దాటిపోయింది. ఒక్కసారి రామనామం వుచ్చరించు. కింద పెట్టుదాం."

ఆ వృద్ధురాలి మృత్యువులోగూడా ఏదో అపనమ్మకమున్నట్లు, శ్రీరాములుగారి మాటల్ని విశ్వసించలేక అతను మంచంమీదికి వంగి చూశాడు. మరుక్షణం ఆయనవంకకు తిరిగి లేచి నిల్చున్నాడు. ఇద్దరూకలిసి శవాన్ని కటిక నేలమీదకు దించి ముఖాలు చూచుకొన్నారు. దహనసంస్కారాలపని చూడాలి. శవంమీద కప్పటానికి గజం కొత్తగుడ్డ గూడా లేదు. కోటిలింగం గడ్డం కింద చెయ్యి పెట్టుకు నిల్చుండిపోయాడు. మొన్నటికన్నా పదేళ్ళు ముసలివాడై, అసహాయుడై—చనిపోయిన తల్లికి చెట్టంత పుత్రుడైన ఈ నిర్మల దేశభక్తుడు శ్రీరాములుగారి ముఖంవంక అతను దృష్టి నిలుపలేకపోయాడు. అప్పటికప్పుడే తెల్లవారి బారెడు పొద్దెక్కినది.

"నేను పోయి తక్కిన పనులు చూస్తాను" అని కోటిలింగం ఆ మృత్యుగుహాంతరాళం నుండి వెలికివచ్చాడు. రాత్రల్లా అతనికి నిద్రలేమి చేత తూలుడు వచ్చింది. తూలుతూ, తూలుతూ యిల్లు జేరాడు. తాయారమ్మ చేతులమీద తన పెళ్ళినాటి పెద్దాపురం పట్టు జరీవుత్తరీయం నలగకుండా మడిచి వేసుకొని ఎక్కడికో ప్రయాణానికి సిద్ధంగా నిలబడివుంది. కోటిలింగం ఆమెకు ఎదురుగానిల్చుని రొప్పుతూ తన ఎర్రని కళ్ళు కిందికి వాల్చి "ఎక్కడికి" అని అడిగాడు.

"ఎక్కడికున్నది? నువ్వు తెచ్చే సంపాదనకు యిక నేను యిల్లు గడల నక్కర్లేదుగా! జంగం దర్జీకి యిదన్నా కుదవ పెట్టకపోతే నీకు ముంతెడు గంజి గూడా దొరకదు రాత్రికి."

సిగ్గుతో అతని ముఖం కందిపోయినది. కాని తాయారమ్మ కళ్లు తన కళ్లను ఎదుర్కొన్నప్పుడు అతని ధైర్యమూ, కోపమూ పటాపంచలైపోయినవి. కోటిలింగం ఆమెను సమీపించి చేతులు చాచినాడు. ఆమె చేతులు అప్రయత్నంగా వణికినవి. పట్టుత్తరీయం జారి కిందబడ్డది. అతను క్షణం తటాపటాయించి వంగి, వుత్తరీయం తీసి చంక పెట్టుకొని తిరిగి క్షణంలో అదృశ్యమైపోయాడు.

* * *

బ్రతికివుండగా చినుగులేని గుడ్డ కట్టకపోయినా, కన్నీరుగూడా రానికట్టె అయిన తర్వాత ముసలమ్మ ఒక పెద్దాపురం జరీ అంచు పట్టుబట్ట కప్పుకొన్నది. శ్రీరాములుగారి తోటికులంవాళ్ళెవరూ సాయం రాలేదు. ఊళ్లో హరికథల తీర్థులూ, ముసలి వితంతువులను పాగిడి పొట్టనింపుకునే రాఘవదీక్షితులూ - యీయన చెప్పతో వెలివేశారు. "అప్పుడు కులం లేదన్నాడుగా: మాలనని చెప్పుకొన్నాడుగా! మరి మాలవాళ్ళచేతనే తల్లిని పాశయించమనవోయ్" అని శ్రీరాములుగారి జ్ఞాతులు కోటిలింగానికి వుచిత సలహానిచ్చారు. చివరకు కొమ్ములుబట్టి పాడెను మోసింది - "రామదాసు" బుచ్చిచౌదరీ, కోటిలింగమూ. శ్రీరాములుగారు నిప్పుకుండ బట్టుకొని ముందు నడిచాడు. చివరకు మంత్రపుష్పం చదివే బ్రాహ్మడుగూడా కరువైనాడు.

శవదహనం, కపాలమోక్షం అయ్యేసరికి తిరిగి అస్తమయమైంది. ఆరోజున రామదాసు బుచ్చయ్యకుగానీ, కోటిలింగానికిగానీ, మాతృహీనుడు శ్రీరాములుగారికిగానీ తిండిలేదు. శ్మశానంనుండి తిరిగివస్తూ శ్రీరాములుగారు బుచ్చయ్యవంక చూసి వెర్రిగా నవ్వసాగాడు. కోటిలింగం వంకకు తిరిగి మళ్ళీ మరింత పెద్దగా నవ్వాడు. వీధుల్లో వున్నజనం — "పాపం, పిచ్చెక్కిపోతుందేమో," అని పెదిమలు చప్పరించటం కోటిలింగం గగుర్పాటుతో విన్నాడు. బుచ్చయ్య అతి కష్టంమీద ఆయన్ను పట్టుకొని యింటికి నడిపించాడు.

కోటిలింగం దీపాలుబెట్టే వేళకు యిల్లు చేరేసరికి ఎగురుగా సావిత్రి కూర్చొని వుంది.

దూకి పారిపోతున్నాడు. కోటిలింగం భయాతురుడు కాలేదు. ఆ మనిషి నతడు సులభంగాగుర్తుపట్టాడు. అతనుఆరోజురాత్రి భారతమ్మయింట్లోకన్పించిన సుబ్బారావు.

కోటిలింగం వెనుదిరిగి వీధివాకిలి వేపుకు వచ్చాడు. తిరిగి అతని కాళ్లకింద ఎండు టాకులు మోగినవి. ఈసారి ఒక క్షణం క్రిందట మూసుకొనివున్న బయటి తలుపు తెరిచివున్నది. అతడు గబగబా బజారు లోకి వచ్చి తొంగిచూచాడు. దూరంగా చీకట్లో ఒదిగి ఒదిగి నడుస్తున్న తాయా రమ్మను గుర్తుపట్టాడు.



## 12

కోటిలింగం తెల్లవారుఝామున వణు కుతూ చలిలో ఇల్లుజేరాడు. అతనికి గడప లోనే తాయారమ్మ వెక్కివెక్కి ఏడు స్తున్న శబ్దం వినిపించింది. చుట్టూ నిశ్శ బ్దాన్ని చీల్చుకొని ఆ శబ్దతరంగాలు తన కొరకే పయనించి వచ్చినట్లతనికి తోచింది.

తాయారమ్మ గడపమీద తల ఆనించి పమిటచెంగు కప్పుకొని పడుకొనివున్నది. కోటిలింగం రాకతో ఆమె ఏడుపు మానింది. అతడు మెల్లగా, తూలుతూ వెళ్ళి ఆమె భుజం తాకాడు. వేడిగా కాలుతున్న అతని వేళ్లు ఆ భుజాన్ని మండించినవి. ఆమె కళ్ళు పెద్దవిచేసుకొని అతని కళ్ళవంక చూచింది. ఆ చీకట్లోగూడా కోటిలింగానికి యింట్లో ఆ మూల చిన్నరాశిగా పోసివున్న బియ్యం కన్పించినవి. వాటిని ఆమెకు తన వేలు జాపి చూపించినాడు.

"నీవు అన్నపూర్ణవు" అన్నాడు మెల్లగా.

తాయారు అతని కళ్ళను తిరిగి పరికిం చింది. ఆ కళ్ళు చింతనిప్పులవలె మండి పోతున్నవి. కాని ఆ నేత్రాల్లో క్రోధం లేదు. శాంతిదేవత వుట్టిపడుతున్నట్లున్నవి. ఆంతరంగిక మానసిక సంఘర్షణలో అవి జ్యోతులయినవి.

"నీవు నా తల్లివి. నేను నీకింకెంత మాత్రమూ భర్తను గాను. నాకే గాదు. ఈ లోకానికి తల్లివి. నా ఆకలి తీర్చేందుకు నీ ధర్మం వదలుకొని మాతృధర్మం వహిం చావు. నీకు నమస్కరించటానికి వచ్చాను. నాకు కోపం లేదు తాయారూ! నీకు గాదు తాయారూ, యీ నమస్కారం. నీలో వున్న జననికి; నీలోని మానవత్వానికి; నీలోని నా తల్లికి."

అతడు వంగి ఆమె పాదాలు స్పృశిం చాడు. ఆమె పాదాలను పైకి లాక్కొనబో యింది. ఆమెలో శక్తి నశించి వాటికి చలనం కలగలేదు. ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది. గడపమీద తల బాదుకొన్నది. అతడు వారించి—"అన్నపూర్ణ దుఃఖ మంటే ఎరుగదు" అని ఆమె తలను మృదు వుగా నిమిరినాడు.

ఆమె ఏడుపు నాపుకొని - "అమరయ్య బాబాయి తిరిగివచ్చాడు." అన్నది.

"అవును, రామానుజయ్య తాత తిరిగి రాలేదుగా."

"ఇంకెక్కడి తాత? తాతను అడవిలో చిరతపులులు తినేసినయ్యని బాబాయి చెప్పినాయి."

> "మన వైద్యులకు ఈలోకం లో చాలామంది శత్రువు లుంటారు"
>
> "సరేలే! పరలోకంలో ఉండే వారితోపోల్చితే వీరొకలెఖ్ఖా?"
>
> —పి. శ్రీధర్, విశాఖపట్నం.

అతను మౌనంగా ఆమె మాటలు విన్నాడు. ఆతరవాత ఆమెగూడా ఏడ్వ లేదు. ఒక దీర్ఘమైన నిట్టూర్పు మాత్రమే వినవచ్చింది. ఆమె పాదాలు తాకుతూ అతడు నిద్రించాడు.

* * *

బ్రహ్మయోగం నుండి లేచినట్లుగా తెల్ల వారిన తర్వాత తన యింటిముందు చెలరేగు తున్న బ్రహ్మాండమైన కోలాహలానికి కోటి లింగం నిద్రమేల్కొన్నాడు. అతన్ని లేపుతూ సత్యం కనిపించాడు. సత్యం జైలునుంచి ఆ రాత్రే విడుదలైవచ్చాడు. అతనిమీద కేసుపోయింది. ఆరాత్రి అమ రయ్య రామానుజయ్య తాత దుర్మరణ వార్త తెచ్చిన రాత్రి.

కోటిలింగం కళ్ళు నులుముకొని లేచి కూర్చున్నాడు. ఎదురుగా ఎంతోమంది జనం, వాళ్ళల్లో సావిత్రి, భారతమ్మ గూడా కన్పించారు. అందరిముందూ నిల్చొన్న అమరయ్యనే అతడు చూడలేదు.

వనకనుంచి మాటలు వినవస్తున్నవి.

"చెఱువులో దూకింది. చెఱువులో"

అప్పటి కతని కర్థమైనది, అమరయ్య వళ్ళో తడిగుడ్డలతో వుబ్బిన తయారమ్మ శవం అతనికి గోచరించింది అతను నెమ్మ దిగా లేచి ఆమె పాదాలవద్ద తన తలనుంచి తిరిగి లేచి నిలబడ్డాడు. అందరూ ఒక్క క్షణం మౌనం వహించారు. అతనికి దారి యిచ్చారు.

అతను సత్యంవంకకు తిరిగి మెల్లగా అన్నాడు.

"నాకు పిలుపు వచ్చింది. నేను రామాను జయ్య తాతను వెదుకబోతున్నాను. నువ్వు వచ్చావు. నా తల్లిని మర్యాదలతో నీవే సాగనంపు."

అతని కళ్లవెంట నీళ్ళులేవు. అతని చేతులు వణకనూలేదు. సత్యం అతనివంక దిక్కుముఖంతో చూచాడు. రామదాసు ముందుకు వచ్చి సాగిపోతున్న అతని కాళ్లకు నమస్కరించాడు. అతను వెనుదిరిగి చూడ లేదు.

(అయిపోయింది)

# జల్సా పురుషుడు

రామలింగేశ్వర్రావు, గోవర్ధనం ఇద్దరూ గుంటూరు హిందూ కాలేజీలోనే చదువుతున్నారు. హాసల్ లోకూడా ఇద్దరూ ఒక రూంలోనే ఉంటూంటారు ఆ హాస్టల్లో అంతే. రూంకి ఇద్దరేసి వుంటారు. రామలింగేశ్వర్రావుకీ, గోవర్ధనానికీ మధ్య ఏ విషయంలోనూ అరమరికలు లేవు. మిత్రులిద్దరూ బహుసన్నితంగా వుంటూవుండేవాళ్ళు. అవి కాలేజీ తెరిచిన కొత్త రోజులు.

రామలింగేశ్వర్రావు బీదవాడు. వాళ్ళ నాన్న చందాలడిగీ, ఇంకా ఎన్నో బాధలు పడీ వాణ్ణి చదివిస్తున్నాడు వాడు ఈ కాస్త డిగ్రీ సంపాయిస్తే, అవతల మేనమామ - కాస్త డబ్బూ పలుకుబడీ గలవాడు - తన కూతుర్నిచ్చి పెళ్లి చెయ్యటమే కాక, ఏదో వుద్యోగం చూపిస్తానని ఆయన తాపత్రయం. రామలింగేశ్వర్రావు కూడా, తెలివిగా, కింద క్లాసులు పాసయినాడు. ఇంటర్ కూడా అట్లాగే నెగ్గాడు. 'అట్లాగే' అంటే తేలికగా అని అర్థం కాదు. కష్టపడి చదివి అని. ఇతర స్టూడెంట్లు, సినిమాలకీ, డ్యాన్సులకీ, కాఫీ ఫలహారాలకీ, డబ్బునీ, కాలాన్నీ వ్యయం చేసే సమయాల్లో, రామలింగేశ్వర్రావు, రెండుపూటలు భోజనం తప్ప ఇతరం ఏమీ లేకుండా, చదివి, పాసయినాడు వాడికి డబ్బు అంటే అదోకరకం పూజ్యభావం ఏర్పడి ఉంది మనస్సులో. డబ్బుకోసం నాన్న పడే కష్టాలు వాడికి బాగా తెలుసు. అందువల్లనే రెండే రెండు చొక్కాలతో, పంచలతో, తానే సబ్బేసి వుతుక్కుంటూ, కాలం గడుపుతూన్నాడు. అతన్ని ఇతర స్టూడెంట్సు ఎవరూ అట్టే లెక్క చెయ్యరు. ఏ కొద్ది మందో మాత్రం, అతని నోట్సు పట్టుకెళ్తుంటారు. అట్లాంటివాళ్లలో ఒకడు గోవర్ధనం. ఒక్క చదువు మినహాయిస్తే, రామలింగేశ్వర్రావులో ఆకరణీయమైన విషయం ఏదీ లేదనే చెప్పాలి. కొంచెం స్ఫురద్రూపే కాని, అతని నిరాడంబరమైన దుస్తులూ అవీ "గాంధేయం"గా వుండి, ఎవర్నీ ప్రత్యేకించి ఆకర్షించలేకపోయ్యేవి.

పోతే, గోవర్ధనం ఇందుకు శుద్ధ వ్యతిరేకంగా కనిపించేవాడు అతను, ఎప్పుడూ అందరిలాగ నీటుగా, తేటగా, శుభ్రమైన బుష్షర్టలూ, పాంటులూ ఇస్త్రీమడత చెరగకుండా తొడిగి, అప్పుడే వికసించిన పువ్వల్లే వుండేవాడు అతని క్రాపుకూడా ఎల్లప్పుడు నున్నగా దువ్వి మెరుస్తుండేది. అతను కాలేజీలో, అన్ని ఫీజులూ ముందుగానే కట్టేసేవాడు. అన్ని పుస్తకాలూ కొనేశాడు. అట్లా 'పంక్చువల్'గా వుండడానికి డబ్బెక్కడిదో?

అంతే కాదు, రామలింగేశ్వర్రావుకి ఇంకో విషయం బహు చిత్రంగా కనిపించేది. ప్రతి సాయంత్రం, గోవర్ధనం నీటుగా ముఖక్షవరం చేసుకుని ఏదో ఓ సినిమాకే గావును వెళ్లేవాడు. తెల్లారి ఆ సినిమా మీద ఓ వుపన్యాసం! వినలేక కడుపులో దేవేది రామలింగేశ్వర్రావుకి. అట్లా జల్సాగా వుంటానికి హేతువైన రాబడి ఏమిటో? వాళ్ళ నాన్న ఏ లాండులార్డో, వ్యాపారస్థుడో అయివుండాలి, అనుకున్నాడు రామలింగేశ్వర్రావు

"శారద"

ఇంతకీ, నెలపైనించీ, ఒకే రూంలో వుంటున్నా, రామలింగేశ్వర్రావు గోవర్ధనాన్ని — "మీ నాన్న ఏంచేస్తున్నాడు-" అని అడగనేలేదు. అతని పనేదో అతను చూసుకుంటున్నాడాయె.

"అయినా అతనికి ఇంత దుబారా పనికిరాదు" అనుకున్నాడు రామలింగేశ్వర్రావు. తనతోపాటు వందమంది హాస్టల్లో కామన్ మెస్ లో భోంచేస్తున్నారు—చవక అని. ఈ గోవర్ధనం అందుకూ వ్యతిరేకమే. తను ఆ విషయం హెచ్చరించకపోయినా ఒక రోజు అతనే చెప్పాడు: "ఈ భోజనం నాకు సయించదండి. అందుకని హోటల్లో భోజనం చేస్తున్నాను" అని.

ప్రతిరోజూ ఉదయం కాఫీహోటలుకి హాజరవుతాడు అతను. రామలింగేశ్వర్రావు కలలోనైనా తలవరాని విషయం అది.

## 2

అది ఆదివారపు ఉదయం. వానాకాలపు చలిగాలి చల్లగా, బద్ధకం గొల్పుతూ వీస్తోంది. గోవర్ధనం, యథార్థంగా ఆలస్యం గావలసినవాడు: కాని, రామలింగేశ్వర్రావు లేచి మొహం కడుక్కునే టప్పటికే, లేచి స్నానం చేసి, టాయిలెట్ అయి హోటలుకి గావును బయల్దేరుతున్నాడు. బయల్దేరి గడపదగ్గిరకి వెళ్ళినవాడు అప్పుడే మొహం కడుక్కుని లోపలికివచ్చిన తన మిత్రుణ్ణి, వెనక్కి తిరిగివచ్చి భుజంతట్టి పిలిచి," "మిత్రమా, రావోయ్ ఆదివారం పూట కాస్త కాఫీ తాగివద్దాం" అన్నాడు.

రామలింగేశ్వర్రావు నిర్మొగమాటస్థుడు. లేనిది, లేదు అని చెప్పటంలో తప్పే



# ★ జల్సా పురుషుడు ★

మిటి? అనుకొన్నాడతను. "నేను రాను గోవర్ధనం క్షమించు. నా దగ్గిర చిల్లర డబ్బులు ఉండవు" అన్నాడు నిదానంగా.

గోవర్ధనం పెద్దగానవ్వి, "నేను పిలుస్తున్నానంటే, నేను కాఫీబిల్లు ఇస్తానని అర్థం మిస్టర్. రా."అన్నాడు నిష్కల్మషమైన స్వరంతో.

రామలింగేశ్వర్రావు ఒకక్షణం. వూగిసలాడాడు, వెళ్దామావద్దా అని. చివరికి ఒక తీర్మానానికి వచ్చి. "ఇవ్వాళ నువ్విస్తావనుకో, ఆ కాఫీ అలవాటయితే రోజూ? నా తిప్పలు భగవంతునికెరుక! నేను రానయ్యాబాబు. మీరంటే వున్న మహారాజులు, రోజుకు ఐదుమాట్లు తాగినా చెలామణి అవుతుంది!" అన్నాడు చిన్న నిట్టూర్పుతో. గోవర్ధనం, చిరునవ్వు నవ్వుతూ, "కాఫీవొద్దు పోనీ, టిఫినన్నా చేద్దుగాని రావయ్యా" అని రామలింగేశ్వర్రావు చెయిపట్టుకు లాక్కెళ్ళసాగాడు.

రామలింగేశ్వర్రావుకి ఇంకా బెట్టుగా వుండటం సబబుగాతోచలేదు. "సరే పద. ఈవార నేను నీకు మళ్ళీ ఒక్క కానీ ఖర్చుపెట్టలేనుగదా అని నా బాధ"అంటూ గదితలుపు తాళం వేసుకుని ఆ గోవర్ధనం వెంట హోటలుకు వెళ్ళాడు. ఆ హోటలు కిటకిట లాడుతోంది అచ్చగా స్టూడెంకట్సుతో. రామలింగేశ్వర్రావు, గోవర్ధనం. ఇద్దరూ నలుగురు స్టూడెంట్సు కూచున్న ఒక టేబిల్ పక్కన ఇంకో టేబిల్ దగ్గిర కూచున్నారు. ఆ నలుగురూ వీళ్ళిద్దర్నీ చూడగానే చిరునవ్వు నవ్వారు. వాళ్ళల్లో ఒకడు చాలా చిన్న గొంతులో పక్కవాళ్ళతో "బుద్ధుడుగారు ఇవ్వాళ కాఫీ కొచ్చార్రోయ్. ఇవ్వాళ తుపాను వస్తుంది మాస్కో!" అన్నాడు. నలుగురూ గొల్లున నవ్వారు.

రామలింగేశ్వర్రావుకి వాళ్ళు ఎందుకు నవ్వుతున్నారో వెంటనే బోధపడింది. అయినా అతను దీన్నేమీ పట్టించుకోలేదు. వాళ్ళు ఇంకా ఏవేవో మాట్లాడుతూ నవ్వుతూనే వున్నారు.

గోవర్ధనం, తనకి ఒక స్ట్రాంగ్ కాఫీ ఆరరిచ్చి, రామలింగేశ్వర్రావుకి, రెండు ఇడ్లలు ఆర్డర్ ఇచ్చాడు.

రామలింగేశ్వర్రావు, ఇడ్లీ సాంబారు తింటూ "గోవర్ధనం, నువ్వు ఏమీ తినకుండా వొట్టి కాఫీ తాగుతు"న్నావేం? అని అడిగాడు.

గోవర్ధనం తన మామూలు చిరునవ్వు నవ్వుతూ, "నా కదే అలవాటు. పొద్దున్నే నేనేం తినను." అన్నాడు ముక్తసరిగా.

రామలింగేశ్వర్రావుకి అంతా విచిత్రంగా వుంది. ఈ గోవర్ధనంబోటివాళ్ళు ఇంత ఫాషన్‌గా, తిండి తినకండా, కాఫీలు తాగి, చిక్కి శల్యమైపోవటం ఎందుకో అని అర్థంగాదు ఎంతకీ డబ్బున్నదిగా! తిన దల్చిందేదో తిని ఏడవరాదా? అతను ఆలోచిస్తూ, ఒక ప్లేటు ఉప్మాగూడా తిని, ఇంక ఏమీ వొద్దని లేచాడు. ఆ గోవర్ధనం బిల్లు తీసుకుని వెనకాలే వెళ్ళాడు. వాళ్ళిద్దరు పోతుంటే, రామలింగేశ్వర్రావుని ఉద్దేశించి, మిగతా స్టూడెంట్సు, ఏవో వినీ వినపడని మాటలు అనుకుంటూ విరగబడి నవ్వుతున్నారు.

గోవర్ధనం మామూలు చిరునవ్వు మానలేదు. రామలింగేశ్వర్రావు, సోమవారం కావల్సిన పాఠాలు జ్ఞాపకం చేసుకుంటూ, తలొంచుకుని నడుస్తున్నాడు.

ఇద్దరూ గడపదగ్గిరకి వొచ్చారు. గోవర్ధనం క్యాషియరుకి బిల్లూ డబ్బులూ ఇచ్చేసి, రామలింగేశ్వర్రావు దగ్గిరకొచ్చి "కిళ్లీ వేసుకుంటావా?" అన్నాడు.

"ఎబ్బే వొద్దు బ్రదర్"అనేశాడు రామలింగేశ్వర్రావు.

"అయితే, నేను, వెళ్లొస్తా. అట్లా షికారు. నువ్వు రూంకి వెళ్తావుగా" అన్నాడు గోవర్ధనం, మిత్రునిదగ్గిర శెలవ తీసుకుంటూ.

## 3

సోమవారం కాలేజీకి వెళ్లేముందే రామలింగేశ్వర్రావు, పోస్టాఫీసుకు వెళ్లాడు, తనకి రావల్సిన మనియార్డరుకోసం. పోస్టుమన్, మనియార్డర్‌కి బదులు, ఓ కార్డు ఇచ్చాడు. అందులో సారాంశం, డబ్బు దొరకలేదనీ, 10 రోజులు ఎట్లాగో తంటాలు పడమనినీ.

రామలింగేశ్వర్రావుకి కడుపులో తిప్పినట్టయింది ఆ ఉత్తరం చదివేసరికల్లా. అవేళే ఏదో ఫీజు- కట్టాల్సిన ఆఖరురోజు. అప్పటికే ఫైను పడింది. ఇక ఊరుకోరు. ఆ.. లైబ్రరీ ఫీజు. అసలు పుస్తకాలు చదవటానికే తీరిక చాలటంలేదు తనకి. ఈ లైబ్రరీ ఫీజు కూడా ఎందుకో? మహా లైబ్రరీలో తను చదువుతున్నట్టు!

రామలింగేశ్వర్రావు గుండె దిటవు చేసుకుని వెళ్ళాడు. ఆవేళటికి గడిస్తే — ఏదో రకంగా క్షమాపణ వేడుకుందాం అని.

కాని, అంతమంది తోటి విద్యార్థుల ఎదుట ఆ ఇంగ్లీషు ప్రొఫెసరు, "నీకు జనరల్ నాలెడ్జి లేదోయ్! ఎట్లా వస్తుందిలే! ఇంతవరకు లైబ్రరీ ఫీజు కట్టలేదుట నువ్వు! వెంటనే ఆ ఫీజు కట్టి, ఎక్కువగా జనరల్ బుక్సు చదువు! రేపు కాలేజీకి వచ్చేటప్పుడు ఆ రసీదు పట్రా!" అని వార్నింగ్ ఇచ్చేప్పటికి, రామలింగేశ్వరరావుకి, యుద్ధభూమిలో కర్ణుడి రథం కుంగిపోతున్నప్పటి బాధ కలిగింది.

వీళ్ళెందుకు గుర్తించరు తన ఆర్థిక బాధని? అని ప్రశ్నించుకుంటూ, అతను రూంకి వొచ్చాడు. అన్నం సరిగా సయించలేదు. రేపు మాత్రం ఫీజు వెక్కణ్ణించి వస్తుంది? ఏం చెయ్యటం ఇప్పుడు? ఏదో ఒకటి చేసి, ఆ ఫీజు కట్టెయ్యాల్సిందే. కాని, ఆ ఏదో ఒకటి ఏమిటి? ఏమిటి? ఇదే ప్రశ్న అతన్ని వేధిస్తోంది.

రూం, గడియ గట్టిగా వేసుకుని కూచున్నాడు లోపల ఆలోచిస్తున్నాడు. గోవర్ధనం మామూలు ప్రకారం, ఏ సినిమాకో వెళ్ళిపోయినాడు రామలింగేశ్వర్రావు ఆలోచన గోవర్ధనంమీదికి పోయింది. "వీడు.. రోజూ ఆ సినిమాలకి తగలేసే డబ్బుపెడ్తే తనకు నెలజీతం వొస్తుంది! అనర్హులదగ్గిర ఇంతింత డబ్బు ఉండటం చిత్రం! అనుకున్నాడు ఆ నిర్భాగ్యుడు. ఆలోచించి ఆలోచించి బుర్ర తిరిగిపోతూ వుంది.

అతనికి అకస్మాత్తుగా ఒక ఆలోచన వచ్చి వొళ్ళు చెమటపోసింది అటువంటి ఆలోచన అదివరలో అతనికి ఎన్నడూ కలిగి వుండదు. "గోవర్ధనం దగ్గిర డబ్బేదయినా ఉంటుంది తనకొక్కవల్సింది పది రూ॥లు. వాడ్ని అడిగితే ఇస్తాడో ఇవ్వడో! మూడొంతులు ఇవ్వకపోవచ్చు. తనే తీసుకుంటే...పదిరోజుల్లో పైకం అందాక, గుట్టుచప్పుడుగా...అమ్మో...దొంగతనమే ...కాని, ఈ వైరాగ్యంకన్న, కాలేజీలో మర్నాడు రసీదు చూపించకపోతే ఎదురయ్యే సమస్య పెద్దదిగా భూతాకారంగా కనపడింది.

రామలింగేశ్వర్రావు ఆలోచించాడు. గోవర్ధనం ఇంకా రెండుగంటల సేపటివరకూ రాడు ఈలోగా వాడి పెట్టెతీసి చూస్తే? డబ్బు ఉండేమాట ఖాయం. తనక్కాల్సింది 10 రూ॥! అంతవరకే తీసుకుని,...ఇట్లా ఆ అరగంట సేపట్లో రామలింగేశ్వర్రావు, తను డబ్బు తస్కరించే దృశ్యాన్ని పాతికసార్లు ఊహాపథంలో రిహార్సల్సు వేసుకుని, ఎట్టకేలకు ఉపక్రమించాడాపనికి. అదేమంత కష్టమైన పనిగా లేదు. గోవర్ధనం పెట్టె, చిన్న

మిల్లర్ లాక్‌తో తాళం వేసివుంది. దాన్ని రెండునిమిషాలు గట్టిగా లాగేసరికి వూడి వచ్చింది. ఆశ్చర్యం! పెట్టెలో ఒక జత బట్టలు, పుస్తకాలూ వున్నాయ్. ఒక షేవింగ్ సెట్టూ, పౌడర్ డబ్బా, పండ్లపొడి పొట్లం, సబ్బు వున్నాయ్. డబ్బు జాడ ఎక్కడా లేదు.

రామలింగేశ్వర్రావు జాగ్రత్తగా బట్టలు తీసి చూశాడు. తర్వాత పుస్తకాలు; ఓ పుస్తకంలో ఓ పదిరూపాయల కాయితం ఒకటి, రెండు రూపాయల కాయితం ఒకటీ ఉన్నయ్. రామలింగేశ్వర్రావు చప్పున పది రూ॥ నోటుతీసి తన జేబులో వేసుకుని, పెట్టెని యధాప్రకారం సర్దేశి, తాళం నొక్కేశాడు. ఇంతసేపూ అతనిగుండె దడదడలాడుతూనే వుంది.

ఆ పైన మళ్ళీ ఆలోచన ప్రారంభమైంది. రేపు గోవర్ధనం పెట్టెలో చూసి, డబ్బు కనపడకపొయ్యేసరికల్లా, గోలచేసి తనను నిలవేస్తే? నిలేస్తాడు! కాని వాడికి తనే తీసినట్టు రుజూ వేముంది? తనకేమీ తెలియదని బుకాయించవచ్చు....ఇట్లాగే ఆలోచిస్తూ ఆలోచిస్తూ, రామలింగేశ్వర్రావు ఆరాత్రల్లా, నిద్రపోనేలేదు. నిద్రపోయిన కాసేపు పీడకలలు వచ్చినయ్.

## 4

తెల్లారి 7½ దాకా గోవర్ధనం నిద్రలేవలేదు. రామలింగేశ్వర్రావు మాత్రం, మామూలుకన్న పెందలకడే లేచి కాలకృత్యాలలో నిమగ్నుడైనాడు. అతను స్నానం చేసి గదిలోకి వచ్చేటప్పటికి, గోవర్ధనం, పెట్టె తెరిచి, వెతుకుతున్నాడు; అతడికళ్లు జ్యోతుల్లాగున్నాయ్ "వుండవూ మరి? ప్రతిరాత్రి రెండుఆటలూ చూసాస్తే" అని రామలింగేశ్వర్రావు అనుకున్నాడు.

గోవర్ధనం పదినిమిషాలు పెట్టంతా గాలించాడు. పుస్తకాలన్నీ తీసి దులిపాడు. రెండురూపాయల కాయితం ఫిజిక్స్ నోట్సుపుస్తకంనుంచి కిందపడింది. అతని మొహం ఎన్నడూ లేనంతగా పాలిపోయింది. అసలే నెత్తురుతక్కువ మనిషి. పెద్దబలిష్టుడూ కాడు

అతను తుదకి ఇహ పదిరూ॥ లు పోయినయ్యని తేల్చుకున్నాక, సన్నని కీచుగొంతుతో "రామలింగేశ్వరావు, రాత్రి గదిలోకి ఇంకెవరన్నా వచ్చారా?" అని ప్రశ్నించాడు. అతడికి సూటిగా, తన మిత్రుడిమీద నేరారోపణ చెయ్యటానికి భయం వేసింది.

"ఎవరూ రాలేదే! ఎందుకూ అట్లా అడుగుతున్నావు, ఎన్నడూ లేని ప్రశ్న?" రామలింగేశ్వర్రావు, సాధ్యమైనంతవరకు తన భావాల్ని దాచుకుంటూ, సహజంగా అడిగాడు.

"నా పెట్టెలో పదిరూపాయల నోటు కనపట్టంలేదోయ్!" అన్నాడు గోవర్ధనం విచారంగా.

"అరెరె!...పెట్టెలోది ఎట్లా పోతుందయ్యా? తాళం వేశావా సరిగ్గా? లేక ఇంకెక్కడన్నా పారేసుకున్నావా? సరిగా జ్ఞాపకం చేసుకో." అని సలహా ఇచ్చాడు, రామలింగేశ్వర్రావు, తడిబట్టలు దణ్ణెంమీద ఆరవేస్తూ. బయట వానచినుకులు పడుతున్నయ్.

గోవర్ధనం, చాలా నిశ్చయంగా, "పొరపాటేమీ లేదోయ్. సోమవారం ఉదయమే, పెట్టెలో పెట్టాను. నాకు బాగా గుర్తు. 12 రూ॥ పెట్టాను. ఇదిగో రెండురూపాయల కాయితం వుండనేవుంది. ఆ పది కాయితమే మాయమైపోయింది!" అన్నాడు రాజ్యం పోగొట్టుకొన్న రాజుకి మల్లె వుంది అతని వైఖరీ స్వరమున్నూ. అంతకన్నా కూడా, అత్యంత విషాదం అతనిలో వున్నటు రామలింగేశ్వర్రావుకి తోచింది. కాని అతను ధ్రువపర్చుకున్నాడు మనసును. "వీడు జల్సాచేసేదాంట్లో ఇది ఎన్నోవంతు! రేపేపాటికి మళ్లీ డబ్బలు తెప్పించుకొంటాడు." అని సర్దుకొన్నాడు.

గోవర్ధనం రెండోమాట మాట్లాడకుండా మామూలుగా స్నానం చేసి, గుడ్డలు వేసుకుని, బయటకి వెళ్లిపోయినాడు. అతనిలోనుంచి, అతని 'పేటంటు' చిరునవ్వు మాయమైనట్టు రామలింగేశ్వర్రావు గుర్తించకపోలేదు.

రామలింగేశ్వర్రావు ఆపూటే లైబ్రరీఫీజు కట్టేశాడు. కాలేజీలో, ఇంగ్లీషు ప్రొఫెసరు అతన్ని రసీదు చూపించమని అడగలేదు. అతని జేబులో రసీదు వున్నది. గోవర్ధనం కూడా కాలేజికి వొచ్చాడు. అతనిలో ఏదో విపరీతమైన ఆందోళన ద్యోతకమైంది. అతని ఆలోచన్లు, కాలేజీ లెక్చర్ల మీద నిలవలేదు.

## 5

గోవర్ధనం, ఆవేళ సినిమాకి వెళ్లలేదు. కాలేజీనుంచి సరాసరి, రూంకి వొచ్చేశాడు. రామలింగేశ్వర్రావు ఏదో థియరీ బటీ పెడుతుండగా, గోవర్ధనం నీరసంగా

(56-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 166. జన్మాంతర వాదము

సత్యమా? అని కొత్తగూడెమునుంచి వారణాసి వెంకటేశ్వర్లుగారు అడుగుతున్నారు.

శరీరానికి భిన్నమైన చైతన్యమే జీవుడనీ, జీవుడు శరీరమునుంచి శరీరానికి మారుతూ జన్మపరంపరల ద్వారా వికాసము పొంది తుదకు మానవజన్మ పొందుతాడనీ, ఇలాగ జన్మపరంపరను పొందక, దాటి, పరమేశ్వరుని సన్నిధానములో నుండడమే మోక్షమనీ వైదికమత మంటుంది. బౌద్ధమతం జన్మ పరంపరలద్వారా కోరికలేని మనస్తత్వాన్ని పొందడమే నిర్వాణమంటుంది. కాని ఇస్లామూ, క్రైస్తవమూ జన్మపరంపర ఉన్నదనవు. జీవుడు పాతిపెట్టబడిన శరీరములోనే విచారణదినము దాకా వుంటాడనీ, భగవంతుడా నాడు శవరాసు లన్నిటినీ బ్రతికించి వారివారి పుణ్య పాపాన్ని బట్టి వారికి స్వర్గనరకాల్ని ప్రసాదిస్తాడనీ అంటాయి ఆ రెండు మతాలున్నూ.

మనవారు జన్మలు కలవనడానికి రెండు మూడు నిరూపణలు చెప్తారు. ఒకటి: తమ బ్రతుకులో ఏ పాపమూ చేసి యెరుగనివారు కొందరు నానాబాధలూ పడతారు. కొందరు ఆగర్భ శ్రీమంతుల ఇళ్ళల్లో పుట్టి సిరిసంపదల్ని అనుభవిస్తారు. మరికొందరు నిరుపేదలై దారిద్ర్యమే అనుభవిస్తారు. కారణములేని అనుభవభేద ముండదనీ, వారు పూర్వజన్మలో పుణ్యాలు చేసి వాటి ఫలితాల్ని ఈ జన్మలో అనుభవిస్తున్నారనీ, దరిద్రులు అలాగే పాపముచేసుకుని ఈ జన్మలో కష్టాలు అనుభవిస్తున్నారనీ అంటారు. రెండో నిరూపణ: మూడేళ్ళపిల్ల లండన్ ఆల్బర్టు హాల్లో ఫిడేలు కచేరీ చేసింది. పాలఘాటు మణికి ఆబాల్యమూ మృదంగ విద్య కరతలామలకము. వీరికి ఈ విద్యలు పూర్వజన్మ సంస్కారశేషము ఈ జన్మలో సాగివచ్చుటవల్ల వచ్చినవని. మూడో నిరూపణ: లాహోరులో వివాహవయస్క తన తండ్రిని, తనకు పూర్వజన్మలో పతిఅయిన మథుర శేటు కడకు తీసుకువెళ్ళి ఆయనకు తన సంగతి రహస్యాలు చెప్పి నిరూపించి, తన తండ్రికి సాయము చేయమన్నదన్న వార్త...

ఈ మూడు నిరూపణలకి పూర్వపక్షము లున్నాయి. మొదటిదానికి: కుమ్మరి చేసే కుండ ఒకటి రాజు దగ్గరకు వెళ్తుంది. ఇంకొకటి బిచ్చగానిదగ్గరకు వెళ్తుంది. దానికి కారణమేమిటి? హఠాత్తుగా జరిగే ఘటనలకి అర్థమేమిటి? అలాగే పుట్టుక కూడానూ అని. రెండవదానికి: పూర్వజన్మ సంస్కారశేషము సంగీతమూ, లెక్కలే గాని వేరు విద్యలలో రాదేమీ? ఏవో రెండింటిని పట్టుకుని ఇదుగో పులి అంటే అదుగో తోక అనడము న్యాయముకాదు. శాస్త్రజ్ఞులు వంశ పరంపరాగత గుణాలను గురించీ, పరిసర ప్రభావజనిత గుణములను గురించీ పరిశోధన చేస్తూన్నారూ, ఒకరిగుణాలకు కారణాల్ని చెప్పతూన్నారు. అలాంటి పరిశోధనకి జన్మాంతరమున్నదని నమ్మడము అవసరములేదు... మూడోదానికి ఈ చిత్ర సంఘటన కూర్గు కన్య ఉపవాసగాథలాగే కల్పితమే అయివుంటుంది. నిజమయితే ఇలాంటి కథలు ముస్లిములలోనూ, క్రైస్తవులలోనూ వినమేమీ? జన్మాంతరము పొందడమే నిజమైతే ఆ పిల్ల ఒక్కర్తికే తెలియడమేమీ? చాలామందికి తెలియాలి గదా?

ఏతావాతా ఒక్క విషయము మట్టుకు నిజము. ఏమిటంటే జన్మ ఉన్నదనడమూ, లేదనడమూ నమ్మకములు మాత్రమే నని. శీతల మండలాలలోనూ ఇసుక ఎడార్ల దేశాలలోనూ పాతిపెట్టిన శరీరమూ కుళ్ళి మట్టిలో కలిసిపోకుండా చాలాకాలము గోరీలో ఉంటుంది. కనక ఆ దేశాలవారికి చచ్చిపోయినవారి 'జీవుడు' ఆ శరీరాన్నే అంటిపెట్టుకుని వుంటాడన్న నమ్మిక కలిగి ఉంటుంది. ఉష్ణమండలాలలో శవాలు కుళ్ళిపోతాయి. కనక వారు శవాలను కాల్చివేసి 'ఇంకొక జన్మఉన్నది జీవుడికి' అని నమ్ముతారు.

ప్రాచీన ఈజిప్టు దేశీయులు చనిపోయిన వారి శరీరాలకు ఏదో అంజనము పూసి శరీరము కుళ్ళకుండా చేశేవారు. అటువంటి మమ్మీలు నేటికీ పాశ్చాత్యుల మ్యూజియములలో ఉన్నాయి. చనిపోయినవారు వినోదించుటకుగాను ఆటవస్తువులూ, గ్రంథాలయాలూ ఉంచేవారు కూడాను.

విజ్ఞానశాస్త్ర దృష్ట్యా జన్మాంతర వాదానికి గట్టి పూర్వపక్షమిది. పోయిన జన్మలో చేసిన పాపాలనుబట్టి ఈ జన్మ వచ్చియుంటే, అసలు మొట్టమొదటి జన్మ ఎలా వచ్చిందీ? పూర్వము భూమిని ఆదిశేషుడూ, కులపర్వతాలూ, దిగ్గజాలూ మోశేవని నమ్మేవారు. అలాగ కిందికి వెళ్తే ఎక్కడో ఒకచోట ఒకరు నిరాధారంగా ఆకాశంలో ఉన్నారనాలి గదా? 'కనక భూమే నిరాధారంగా ఉన్నదందాము' అని భారతీయ సిద్ధాంతి ఒకాయన వాదించాడు. ఆ పద్ధతిని ఈ జన్మయే మొదటి జన్మ అనుకోవచ్చు గదా?

అయితే నిరూపించడానికి సాధనాలు లేవు. జన్మపరంపర ఉన్నదన్న నమ్మకము నమ్మకముమాత్రమే. నిర్ధారణ అయిపోయిన సత్యముకాదు.

నేటి పాశ్చాత్యులు కొందరు ఈ బొందెలోనుండిన జీవుడే ఆ బొందెలో ఉన్నాడని కాక, జీవులు చైతన్య సముద్రములో తరంగాలనీ, జీవులద్వారా భగవంతుడు పరిపూర్ణవికాసము పొందుతున్నాడనీ నమ్ముతారు. మీ అంశ ఒకటీ నా అంశ ఒకటీ, ఇంకొకరి అంశమరొకటీ చేరి కొత్త జీవుడుఅంటే 'ఆత్మ' కావచ్చునని వారి నమ్మిక. అలాగే అయితే "పూర్వజన్మ" ఏదో తెలియడానికి వీలులేదు. ఒకొక్కరి మిశ్రశక్తులకి వ్యాఖ్యానము వస్తుంది. అంటే జీవుడు 'సంయుక్తజీవుడు' అన్నమాట. కనక ఒక్క హెచ్చరిక: ఇవన్నీ నమ్మకాలుమట్టుకే.

# 167. పిడుగు

పిడుగునుగురించిన ప్రశ్నలు పుంఖాను పుంఖాలుగా వస్తున్నాయి. వీలైనంత తేటగా వివరిస్తాను, శ్రద్ధగా గుర్తించండి:

ఫౌంటెన్ పెన్ను కొసని ఫ్లానల్ చొక్కాతో గాని వూలుకోటు మీదగాని రుద్ది, పంచకొసలలో పీచురేగినట్లున్న దారాలదగ్గిరకి తీసికెళ్లండి ఈ దారాల్ని ఆ పెన్ను ఆకర్షిస్తుంది. అలాగే గాజుగొట్టాన్ని సిల్కు రుమాలుతో రుద్దినా ఆకర్షిస్తుంది. ఈ వింత ఆకర్షణశక్తి పెన్నుకీ, గాజుకీ ఆవేశించిన విద్యుత్తువల్ల వస్తున్నదన్నారు వైజ్ఞానికులు.

అయితే పట్టుతో రుద్దిన గాజుకడ్డీ నావేశించే విద్యుత్తూ, ఫ్లానల్తో రుద్దిన ఫౌంటెన్ పెన్నుని ఆవేశించిన విద్యుత్తూ ఒకేరకమువి కావు. అలాంటి గాజుకడ్డీని వ్రేలాడదీసి మరొకదాన్ని దగ్గిరకి తీసుకువెళ్లితే వ్రేలాడదీసినకడ్డీ కొసదూరముగా పోతుంది అలాగే పెన్నులూను. అయితే గాజుకడ్డీని వ్రేలాడదీసి, పట్టుతో రుద్ది వదిలి, దాని కొసదగ్గిరకి ఫ్లానల్ తో రుద్దిన పెన్నుకొసని తీసుకు వెళ్లితే ఈ రెండూ ఆకర్షించుకుంటాయి. ఒకేరకపు విద్యుదావేశాలకి వికర్షణా, వేరురకాల విద్యుదావేశాలకి ఆకర్షణా వుంది.

పట్టుతో రుద్దిన గాజుకడ్డీకి విద్యుత్తు ఆవేశిస్తున్నట్లయితే, పట్టురుమాలుకో ? అని పరీక్షించారు. రుమాలుకి గాజు నావేశించిన దానికి వ్యతిరేకపు రకం విద్యుత్తు ఆవేశించింది. 'బాగానే వుంది. పట్టుకే విద్యుత్తు వచ్చింది. గాజుకడ్డీకీ ఉంది. ఈ రెండూ చేర్చితేనో ?' అని పరిశీలించారు. విద్యుత్తే లేదు. కనక గాజు నావేశించినది ధన విద్యుత్తు అన్నారు. పట్టు నావేశించినది ఋణవిద్యుత్తన్నారు. ధనమూ ఋణమూ చేరితే మిగిలేది ఏమీ ఉండదుగదా? గాజుకడ్డీ, పట్టురుమాలూ రుద్దిన తర్వాత చేర్చివుంచిన ఏ విద్యుత్తూ ఉండదు.

అయితే విద్యుదావేశము గల వస్తువులు దారపుకొసల్నీ, ఫ్లానల్ వెంట్రుకల్నీ సుద్ద పొడినీ ఎందుకు ఆకర్షించాయీ? ప్రతీ వస్తువులోనూ ధన ఋణ విద్యుత్తులు సరిసమానముగా వున్నాయన్నారు. ధన విద్యుదావేశితమైన ఒక వస్తువును స్థిరముగా ఉన్న మరొక తేలిక వస్తువు కడకు తీసుకువెళ్ళితే, మొదటిదాని ధన విద్యుత్తు రెండవదానిలోని ఋణ విద్యుతును ఆకర్షించి తన వైపు లాగుతుంది. అంటే రెండో వస్తువులోని ధన ఋణ విద్యుత్తులు తాత్కాలికంగా వేరైసాయి. ఇప్పుడు పై వస్తువు ధన విద్యుత్తుకీ, రెండో వస్తువు ఋణ విద్యుత్తుకీ గల ఆకర్షణ ఈ రెండింటినీ దగ్గిరకి చేరుస్తుంది (నీటిలో మునిగే మనిషికి పైమనిషి చెయ్యి అందించబోతే పట్టుకున్నట్లన్నమాట!)

మేఘాలు గాలితో రాపిడివల్ల విద్యుత్పూరితాలవుతాయి. ఈ ఆవేశము ఎక్కువైన కొద్దీ భూమిలో వుండే విద్యుత్తు, మేఘాల విద్యుత్తువైపు జరుగుతుంది.

ఒక వస్తువు నావేశించిన విద్యుత్తు దాని ఉపరితలాన్ని అంతటా సమంగా ఆవరించక, కొసలూ, కోసులూ ఉన్నచోట గుమికూడుతుంది. కనక భూమిలోని విద్యుత్తు మబ్బుల ఆకర్షణకి చెట్లకొసలమీదా, ఎత్తైన మేడలమీదా, సముద్రమైతే ఓడలకొయ్యల కొసలమీదా ఒత్తుగా చేరుకుంటుంది ఆకర్షణ బలమైతే ధరాలున మెరుపు మెరిసి రెండు విద్యుత్తులూ చేరి వేడిమిగా మారతాయి. ఇదే పిడుగు అంటే.

మేడలకొసని రాగి చెయ్యి అమర్చి, దాని కొడని భూమిదాకా రాగిపట్టీతో కలుపుతారు. అప్పుడు భూమియొక్క విద్యుత్తు 'ఆ చేతివేళ్ళ' కొసలనుంచి మబ్బుల వైపు దాటుకుపోతుంది. మబ్బులవిద్యుత్తు దిగినా, రాగిపట్టీద్వారా భూమిలోకి నిరపాయంగా చేరుకుంటుంది. ఓడకొయ్యల కొసనికూడా ఇలాగే అమర్చి, రాగిపట్టీని సముద్రపు నీటిదాకా లాగుతారు. మబ్బుల విద్యుత్తు సముద్రము నీటికి అందుతుంది.

మబ్బుల విద్యుత్తుభూమికి సులువుగా అందడానికి వీలులేకపోతేనే 'పిడుగు పడుతుంది.'



"ఏమిట్రా అది?"

"బావకుప్రత్తరం వ్రాస్తున్నా"

"నీకు వ్రాయడమే చేతకాదే"

"ఫరవాలేదులే, బావకు కూడా చదవడంరాదు"

—గోపిశ్రీ.

## బొమ్మరిల్లు

# అతడు చెప్పినవిద్దె



పురాణపండ సుందరరావు

ఒకనాడు ఒకరైతు
పనిమీద పట్టణము
ఏగెనొక ఉదయమ్ము,
పదిగంట లగు వేళ.

దారి తెలియని రైతు
పోలీసు కనబడగ
చూచి సంతసమంది
దరిచేరి యతనితో

'ఏమయ్య!' అనునంత
కోపమున పోలీసు
చెంపపై తగిలించె
చెంపకాయలు రెండు.

అయినను ఆరైతు
వినయభావముతోడ
తిరిగి యిట్లనినాడు.
"జీహుజూర్! జోహుకుమ్!

నేనేమి చేసితిని
నన్నిట్లు కొట్టితిరి
యిది మీకు న్యాయమా?"

దాని విని పోలీసు
నుడువసాగెను యిటుల:

"చూడలేదా! నీవు
తలమీద నాటోపి
తలమీద దీనినీ
ధరియించు వారలకు

అధికార బలమెల్ల
సిద్ధించు - తెలిసికో"
అని చెప్పి యావ్యక్తి
'టీ' గృహములో దూరి
ఆర్డరిచ్చెను 'టీ' కి.

కమ్మనౌ తేనీరు
సేవించు పోలీసు
తలమీద టోపీని
తీసి యెదటుంచె.

అదిచూచి యారైతు
టోపీని తలపైన
ధరియించి పోలీసు
చెంపలను వాయించె.

ఈ ఘోర మేమనుచు
అందరూ అడుగగా
అతడు చెప్పిన విద్దె
యని చెప్పె యారైతు.





(సీరియల్)

# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

R-L-STEVENSON



## 10

### హెన్రీజెకిల్ వివరించిన సర్వసమగ్ర కథ

**18**...సం॥లో నేను భాగ్యవంతుల బిడ్డనై జన్మించాను. అంతేగాక, నాకు సహజసిద్ధమైన తెలివితేటలు బాగా ఉండేవి. పాటుపడి కృషిచేసే స్వభావం నాది. పండితుల గౌరవాదరణ పొందవలెననే ఆసక్తి ఉండేది. అటువంటి పరిస్థితిలో కీర్తిగౌరవములతో పేరు ప్రసిద్ధిలోనికి రాగల అవకాశము నాకు నిశ్చయంగా ఉండెనని పై సందర్భములనుబట్టి ఊహించుకోవచ్చును. నాలో ఉన్న లోపములలోకెల్లా నికృష్టమైన లోపము ఏమిటంటే, వెనుక ముందు యోచించని ఖులాసా దిలాసాతత్వం - అటువంటి స్వభావలక్షణంమూలంగా చాలామందికి జీవితం సంతోషంగా గడిచింది. కాని, పదిమందిముందర కొంచెం అసాధారణమైన గాంభీర్యంతో తల ఎత్తుకొని తిరుగవలెననే కీవి నాలో ఉండుటవల్ల ఈ రాజసలక్షణానికిన్నీ నాలో ఉన్న ఖులాసాదిలాసాతత్వానికిన్నీ పొత్తు కలియలేదు. ఆ కారణమువల్ల నాలో ఉన్న సరదాలను పైకి కన్పించనీయకుండా నేను కప్పిపుచ్చి ప్రవర్తించాను. నేను పెరిగి పెద్దవాడనై ఆత్మ పరిశీలన చేసికోగల వయస్సునకు వచ్చినపిమ్మట, ప్రపంచంలో నా స్థితిని, నాఅభ్యుదయాభివృద్ధిని, ఎంచి చూచుకోగల వయస్సుకు నేను వచ్చినపిమ్మట, నా జీవితములో ఒకవిధమైన ద్వంద్వ స్వభావప్రవృత్తి బాగా వేరుపారియున్నదని గ్రహించాను. ఏ అవలక్షణములను నాలోని దోషములుగా నేను పరిగణించానో, అట్టివానినే తదితరులు బాహాటంగా బడాయిగా వెల్లడించుకోగలరు. కాని, నేను కొన్ని ఉత్తమ ఉన్నత జీవితలక్ష్యములను దృష్టియందుంచుకొన్నవాడనగుటచేత, నాలోని అవలక్షణములను చూచి నేనే సిగ్గుపడి, వాటిని కప్పిపుచ్చి ప్రవర్తించాను. నాలో ఉన్న మంచీ చెడ్డా రెండు భిన్నతత్వాలుగా విభక్తమై పొత్తు కలియక విడిపోయినాయి. ప్రతిమానవునియందూ ద్వంద్వ స్వభావము చాలా సమ్మిళితంగా ఉంటుంది. ఈ ద్వంద్వస్వభావము చాలామందిలో విడివడియుండుట కలదు. కాని, అట్టి వారందరిలోకంటే నాలో యీ సుగుణదుర్గుణములు వ్యత్యస్తములై ఆవలి యొడ్డు యీవలి యొడ్డు అన్నట్లుగా విడివడియున్నవి. నాయందున్న అవలక్షణములు అతి నీచములైనవగుటవల్ల యీ తీవ్ర విభజన నాలో ఏర్పడలేదు. నాలో సహజ సిద్ధంగా ఉన్నటువంటి కొన్ని ఉన్నతాశయముల మూలంగానే, యీ సుగుణదుర్గుణములకు పొత్తు కలియక తీవ్ర విభజనఏర్పడుట సంభవించింది. మానవ జీవితములోని దుఃఖమున కంతటికీ మూలకందమైనటువంటి ఈ అభేద్యజీవితప్రవృత్తిధర్మమునుగూర్చి మననంచేస్తూ దీర్ఘాలోచనలో పడ్డాను. మతోపదేశములకన్నింటికీ యిదే ప్రాతిపదిక. నేను రెండు భిన్న ప్రకృతులతో వ్యవహరించువాడనైనప్పటికీ, నాలో కపటంగాని మాయపటాటోపంగాని లేదు. నాలో ఉన్న రెండు భిన్నతత్వములున్నూ దేనికది త్రికరణశుద్ధిగానే వ్యక్తమౌతూ ఉండేది. పగటిపూట అంతా నేను శాస్త్రవిజ్ఞానాభివృద్ధికి కృషి చేసినప్పుడుగాని, సోదరమానవుల దీన దుర్భరావస్థల దొలగించుటకై

మూలం : రాబర్ట్ లూయీ స్టీవెన్సన్  అనువాదం : దాసు వామనరావు





సేవ చేసినప్పుడుగాని, నేనెంత సహజంగా ప్రవర్తిస్తానో, నా మనోనిగ్రహమును విడనాడి హేయమైన చర్యలకు పాల్పడినప్పుడుకూడా నేనంత సహజంగానే ప్రవర్తిస్తాను. నా దేహేంద్రియములయందు నిరంతర సంఘర్షణ మొకటి సద్వృత్తికీ, అసద్వృత్తికీ జరుగుచున్నదనెడి ఇంగితజ్ఞానము నాకు కలిగింది. మానవుని అంతరింద్రియశక్తులను గూర్చియు, ఆత్మోజ్జీవన వికాసమును గూర్చియు నేను విశేషశాస్త్రజిజ్ఞాస చేసిన కారణంచేత, పైజెప్పిన నిరంతరసంఘర్షణవల్ల నా ఇంగితజ్ఞానమున కొక అధిక వికాసం కలిగింది. నా తెలివితేటలనూ, నాకుగల నైతికదృష్టినీ కేంద్రీకరించి యోచించుటవల్ల ఒక నిత్యసత్యమును నేను గ్రహింపగల్గితిని. ఏ మానవుడైనా నిజంగా ఏకైకవ్యక్తికాడనియు, రెండు వ్యక్తుల సంపుటియనియు, గ్రహింపగల్గితిని ఈ సత్యస్వరూపమును కొంతవరకే నేను గ్రహించినవాడనగుటచేత నా జీవితము బుగ్గిలో పోసిన పన్నీరైనది. ప్రతి మానవుడూ రెండు వ్యక్తుల సంపుటియని నేను వాదిస్తాను. నాకు లభించిన తత్వజ్ఞానము అంతకుమించి పైకి పోవుటలేదు. నా అనంతరము ఇతరులు కొందరుద్భవించి నేననుసరించిన పరిశోధనమార్గములనే అనుసరించి నాకంటె ఎక్కువైన విషయాలను వారు కనుగొనవచ్చును. అప్పుడు, మానవుడనే వానిలో అసంబద్ధములైన వేర్వేరు భిన్న స్వతంత్ర ప్రకృతులు స్థిరావాసములు గల భూతములవలె ఉండుననియు, మానవుడంటే యిట్టి బహు భిన్నప్రకృతులకూటమనియు, ఉత్తరోత్తర నాయనంతర శాస్త్రవేత్తలు కన్గొని నిరూపించగలరని నేనూహించి సాహసించి చెప్పగలను. నామట్టుకు నేను, నా జీవిత ప్రవృత్తినిబట్టి ఒకవిధమైన తత్వవిమర్శచేసి, అందులో నిర్దుష్టంగా సత్యనిరూపణ చేశాను. నేను చేసిన సత్యనిరూపణ ఒకవిధమైన తత్వవిమర్శకుమాత్రమే సంబంధించియున్నది ఆతత్వపరిశీలన నైతికవిచక్షణతోకూడినదై యున్నది. నా సొంతవిషయంలోనే నేనిది పూర్తిగా గ్రహించాను. మానవునియందు అనాదిసిద్ధమైన సంపూర్ణమైన ద్వంద్వప్రకృతి సంపుటి యున్నదని గ్రహించాను. నాయందు రెండు భిన్నప్రకృతులు వేర్వేరుగా ఉండడంవల్లనే ఆ రెండింటికీ పరస్పరసంఘర్షణ అనేది నా అంతరాత్మయందు ఏర్పడుతోంది. ఆ రెండు భిన్నప్రకృతులూ కలిసినేనే అని వాదించినప్పటికీ, నేను ఒక్కొక్కప్రకృతియందు స్వతంత్రవ్యక్తిత్వంతో ఉంటున్నానని అంగీకరించాలి. ఈ రెండు ప్రకృతులనూ వేర్వేరుచేయుట సాధ్యం కావచ్చునని ఆశిస్తూ, అటువంటిది సాధ్యమని నా శాస్త్ర పరిశోధనలు నాకు దారిచూపించుటకుపూర్వమే, ఆవిషయమై గొంతెమ్మ కోరికలు కోరుతూ ఉన్నాను. ఆవిషయమై నేను ఉల్లాసంతో ఊహాగానం చేస్తున్నాను. ఈ రెండు భిన్నప్రకృతులనూ, వేర్వేరు శాల్తీలుగా విడదీసి రెండు భిన్నమూర్తులుగా మూర్తీభవింపజేసినట్లయితే, జీవితంలో మానసిక దుర్భర దురవస్థలనేవి పూర్తిగా తొలగిపోగలవు. ఉన్నత ఉదాత్తాశయములతో కూడిన ప్రకృతితో పొత్తులేకుండా, నీచనికృష్ట ప్రకృతి అనేది దానిత్రోవను అది విడివడిపోయేటట్లు చేయవచ్చును. ఆవిధంగా పృథక్కరించినయెడల, మానవుడు ధర్మబుద్ధిసంకలితుడై, నిర్భయముగా, భ్రమప్రమాదరహితుడై, తనకు మానసానందకరములైన సత్కార్యములనుజేయుచు, దుశ్చింతాప్రేరితుడై దుష్కార్యములజేయక, పరాభవ పశ్చాత్తాపములకు పాల్పడక, తన ఉత్తమ ఉత్తరగతి నెరింగి పురోగమించగలడు.

ఇటువంటి రెండు విరుద్ధప్రకృతులు, రెండు కట్టెలను కలిపి కట్టినవిధంగా, ఒక్క మానవునిలో ఉండడంవల్లనే మానవుడు శాపగ్రస్తుడైనట్లుగా ఉన్నాడు. ఒకే సూదంటురాయియొక్క ఉత్తరధృవ దక్షిణధృవ ఆకర్షణశక్తులు నిత్యము ప్రతిఘటించుచున్నవిధంగా, మానవుని అంతరంగమునందు సుశీల దుశ్శీల ప్రకృతులు సదా కలహించుచుండుట మానవజాతి కొక శాపమువలె ఉంది. అయితే, యీ రెండు ప్రకృతులను పృథక్కరించడం ఎట్లా సాధ్యమైంది?

ఈవిధంగా నేను మననం చేయుచున్న కాలమందు, నా శాస్త్ర పరిశోధనామందిరంలో సంఘటించిన ఒక విశేషంవల్ల, కొత్తఊహాలు నామనస్సుకు తట్టినవి. మనము ఏ దేహంతో యీ ప్రపంచంలో

నిండు ముస్తాబుతో సంచరిస్తున్నామో, అట్టి యీ దేహము స్థూల స్థిరాకారంగలదిగా పైకి కన్పించినప్పటికీ, అది రూపు మారిపోగల అస్థిర అభౌతిక సూక్ష్మతత్వముకలదై, పొగమంచువలె విడిపోయి ఆత్మపరివర్తనం పొందగల్గినదని, నేను గ్రహించాను. అదివరకు సిద్ధాంతీకరింపబడినదానికంటె మరింత శుద్ధంగా యీవిషయం నేను గ్రహించాను. ఒక సభామంటపమునకుచుట్టునున్న తెరలను ప్రచండమైన గాలివచ్చి అటు యిటు ఎగురగొట్టిన విధంగానే, యీ శరీరమనెడి ముసుగును చెదరగొట్టివేయ గల కొన్ని ఔషధ ద్రవ్యముల ప్రభావమును నేను కనుగొన్నాను. ఈ విషయమును నేను ఏవిధముగా కనుగొంటినో, ఆ శాస్త్రపరిశోధనా విధాన వివరములను నేను సవిస్తరముగా యిచట ప్రస్తావించదలంచుకోలేదు. అందుకు రెండు ముఖ్యకారణము లున్నవి. ఒకటి ఏదనగా, మన జీవితభవిష్యత్తుకు మనమే బాధ్యులము. ఆ బాధ్యత మన నెత్తిమీదనే ఉంది. అట్టి బాధ్యతను తొలగించుటకు ప్రయత్నము చేసినట్లయితే, అట్టి బాధ్యత మరింత అసాధారణ, అతి భీకరధాటీతో మన నెత్తిమీద పడుతుంది. ఇక రెండో కారణం ఏమిటంటే, నే నిప్పుడు వివరించెడి నా జీవిత కథాకలాపమువల్ల మీకు విదితమయ్యెడి సారాంశమునుబట్టి నాయొక్క శాస్త్ర పరిశోధనలు దురదృష్టవశాత్తు అసంపూర్ణములైనవని తెలియగలదు. నా అంతరాత్మలో చేరియున్న కొన్ని శక్తుల ప్రతిభావికాసం అంతరాత్మను ఆవరించియున్న ఒక తేజస్సువంటిదని నేను గ్రహించాను. అంతేకాదు. ఈ శక్తులు నా అంతరాత్మయందు ప్రబలమై ప్రాధాన్యం వహించకుండా, వాటి ప్రకోపములను తొలగించుటకు వీలైన ఒక ఔషధ ద్రవ్యమును తయారుచేయగలిగినాను. ఆ మందువల్ల, మరొక ఆకారం ముఖవికారం నాకు ఏర్పడగలదు. నా అంతరాత్మలో ఉన్నటువంటి నికృష్టతత్వలక్షణములు యీ ఆకారంలో మూర్తీభవించి ఉంటాయి అయినప్పటికీ అదికూడా నా సహజవ్యక్తిత్వ మూర్తియే.

ఈ సిద్ధాంతముయొక్క పరిశోధనప్రయోగం ఉపక్రమించుటకు పూర్వము నేను చాలా సంకోచించాను. ఇటువంటి పరీక్షలవల్ల నాకు ప్రాణంపోగే ప్రమాదావకాశం ఉంది. ఎందుచేతనంటే, నేను కనిపెట్టిన ఔషధద్రవ్యం దేహముయొక్క ఆకార స్వరూపాన్ని గుర్తుపట్టుటకు వీలులేకుండా సమూలంగా సమగ్రంగా పెకలించి కదలించి తారుమారు చేస్తుంది. అటువంటి సందర్భంలో యీ ఔషధమును రవ్వంత హెచ్చు మోతాదులో పుచ్చుకొనినట్లయితే, తరుణము కనిపెట్టి దానిని సేవించనియెడలను, ఏ క్రొత్త ఆకారములోనికి నా శరీరము మారిపోవలెనని నిరీక్షిస్తున్నానో, అట్టి సూక్ష్మతత్వపరికల్పిత నూతన మూర్తి నాకు ఏర్పడకుండా అది పటాపంచలు కావచ్చును కాని, ఇంతటి అపరూప అమోఘఅద్భుత ఔషధ ప్రభావమును పరీక్షించి చూడవలెనను ఆశ నాకు అమితమైనందున, ప్రమాదభయమునుకూడా నేను లెక్కచేయలేదు. కావలసిన ఔషధ ద్రావకమును చాలాకాలంక్రిందటనే నేను తయారుచేసినాను. నేనుచేసిన పరిశోధనలనుబట్టి అందులో ఒక క్షారము కట్టెడవటి దినుసుగా చేరవలసి యుండెను. ఔషధ ద్రవ్యముల టోకు వ్యాపారంచేసెడి ఒక వ్యాపారస్థునివద్ద ఆ క్షారమును భారీ మొత్తముగా ఒక్కసారిగా నేను కొని ఉంచుకొన్నాను. ఒక దౌర్భాగ్య రాత్రి సమయమందు, ఆ రస ద్రవ్యములను నేను మిశ్రమం చేశాను. అవి అన్నీ గ్లాసులోటాలో కాగి ఆవిరి పైకి వస్తూఉంటే శ్రద్ధగా కనిపెట్టి చూచాను. ఆ గ్లాసులోని పొంగు అంతా చల్లారిన తర్వాత ధైర్యంతో ఆనందంగా ఆమందు త్రాగివేశాను.

బ్రహ్మాండమైన నొప్పులు ప్రారంభమైనాయి. ఎముకలు చితుకకొట్టినట్లయింది. విపరీతమైన పైత్యవికారం ప్రారంభమైంది. ప్రసవకాలమందుగాని, మరణకాలమందుగాని ఉండే ఆవేదనకంటె అత్యధికమైన మనోవేదన మొదలు పెట్టింది. ఈ బాధలన్నీ క్రమేణ తగ్గినవి. విపరీతమైన జబ్బుపడి లేచినవానివలె నాకు తిరిగీ స్థిమితం ఏర్పడింది. నా ఇంద్రియ పరిజ్ఞానం ఒకవింత వైఖరిలో ఉంది. నాకు కలిగిన క్రొత్త స్పృహ వినూత్నమై విచిత్రమై అనిర్వచనీయంగా ఉంది. ఇదంతా నాకు క్రొత్త అవతారంగా ఉండుటవల్ల, యీ నూతన ఇంద్రియానుభవమంతా మధురంగా ఉంది. నమ్మడానికి వీలులేనంత మధురంగా ఉంది. నాకేదో నూతన యౌవనంవచ్చి



## మనిషిలో మనిషి



సట్లుంది. శరీరం లఘువుగా చలాకీగా ఉంది. శరీ ఇంద్రియ భోగవాంఛలతో తలకైపెక్కి, నా ఊహా
రంలో బలే ఖులాసాగా ఉంది. నా అంతరంగంలో ఒక ప్రపంచంలో అవి మేఘాలవలె పరుగెత్తుతున్నాయి.
విధమైన తలపొగరు నిర్లక్ష్యం అతిశయించి ఉంది. లోకులతో మొగమోటములూ, జవాబుదారీలూ,











లేకుండా ప్రవర్తించే విశృంఖలధోరణి ఏర్పడింది. కాని, అది విశుద్ధమైన ఆత్మ స్వాతంత్ర్యము మాత్రము కాదు. ఈ నూతన రూపాంతరము నాకు కలిగిన తోడనే, నాలో దుస్స్వభావము బాగా ఉన్నదని గ్రహించాను. దశాధికంగా దుష్టుడనైనాను. నాలో అదివరకు ఉన్న దుస్స్వభావానికి బానిసనై పోయినాను. ఈ భావం ఆక్షణంలో నాకొక దిలాసా పుట్టించి, సారాయిమత్తువలె కైపెక్కించింది. నాచేతులను ముందుకు బాగా చాచి చూచుకున్నాను. తాజా శరీరం, తాజా అవయవములు సంప్రాప్తించినందువల్ల, ఒకవిధమైన సరదా నాలో ఉద్భవించింది. ఈ రూపాంతర పరివర్తన మూలంగా నా ఆకారంఎత్తు తగ్గి నేను చాలా పొట్టివాడనైతినని నాకు హఠాత్తుగా స్ఫురించింది.

ఆనాటికి, నాగదిలో నిలువుటద్దం లేదు. ఈ ఉత్తరం నేను వ్రాయుచున్ననాటికి నాగదిలో నా ప్రక్కనున్న నిలువుటద్దము, కొలది దినముల తర్వాత, నా రూపాంతర పరివర్తనములను నేను చూచుకొనుచుండుటకై తెప్పించబడినట్టిది. రాత్రి చాలా ప్రొద్దు గడచింది. వేకువజాము సమీపించే సమయమైంది. సూర్యోదయం కాబోయే ఘడియలు సమీపిస్తున్నాయి. నాయింట్లో ఉండే నవుకర్లు మంచి గాఢ నిద్రలో నిమగ్నులై యున్నారు. నాపడక గదివరకూ నా యీ కొత్తఅవతారంలో నడచిపోవుటకు విజయోత్సాహంతో సాహసించాను. పెరటిజాగాను దాటి వెళ్లాను. పైన ఆకాశంలో ఉన్న నక్షత్రరాసులన్నీ నన్ను చాలా లోకువగా క్రిందుగా చూచాయి. అప్రమత్తతో అతి జాగరూకతతో మిణుకుమిణుకుమనెడి ఆతారకాగణము ఇదివరకెన్నడూ చూచి ఎరుంగని క్రొత్త దేహధారిని నేనని నాలోనేను ఉప్పొంగిపోయినాను. నాయింటికినేనే పరాయివాడనై వసారాలలో రహస్యంగా తిరిగాను. నాగదిలోకి ప్రప్రథమంగా యీ క్రొత్తరూపంలో ప్రవేశించి, ఎడ్వర్డు హైడ్ రూపం నాకు అబ్బినదని తొల్దొల్తగా చూచుకొన్నాను.

ఇక నేను తత్వసిద్ధాంతభాగం కొంత వివరించవలసి యున్నది. నాకు స్థిరనిర్ణయంగా తెలిసిన విషయములు కావివి.—కాని, ఏ అంశములు బహుశః స్థిరసత్యములై యుండవచ్చునని నేను ఊహించుచున్నానో, అట్టివానినే యిప్పుడిక్కడ వివరించుచున్నాను. నాలో ఉన్నటువంటి దుస్స్వభావమునే యిప్పుడు ప్రబలంచేసి ప్రత్యేకరూపంలో మూర్తీభవింపజేశాను. నాలో ఉన్నటువంటి సత్స్వభావమునకు నాలో ఉపాధిగాని స్థావరంగాని లేకుండా తొలగించాను. నాలోఉన్న సత్స్వభావంకంటె యీ దుస్స్వభావం తక్కువ పటిమ, తక్కువ పెంపు గలదై యున్నది. నాజీవితం విశేషంగా పదింట తొమ్మిది పాళ్లు నిరంతరసాధకం, సత్ప్రవర్తన, మనోనిగ్రహంతో కూడినదై యుండెను. అటువంటి జీవితంలో నా దుస్స్వభావం అనేది చాలా తక్కువ సాధకం, తక్కువ ఆచరణానుష్ఠానం కలదై యుండుటవల్లను ఎక్కువ నీరసస్థితిలో నుండుటవల్లను, ఎడ్వర్డుహైడ్ రూపంలో అది మూర్తీభవించేసరికి, ఎడ్వర్డు హైడ్‌యొక్క విగ్రహం చిన్నదై, లఘువై, హెన్రీ, జెకిల్‌కంటె ఎడ్వర్డుహైడ్ పిన్న వయస్కుడుగా తయారైనాడు. హెన్రీ జెకిల్ ముఖారవిందంలో సత్స్వభావం ప్రకాశిస్తూఉన్నవిధంగానే, దుస్స్వభావం అనేది రెండో మూర్తి ముఖంమీద లిఖింపబడినట్లుగా అక్షరాలా కన్పిస్తూ ఉండేది. దుస్స్వభావం అనేది ప్రాణాంతకమైనది. అటువంటి దుస్స్వభావం యీ హైడ్ ఆకృతిని వికృతంచేసి, కృంగి కృశించేటట్లు చేసింది. అటువంటి ఆకారమూర్తిని నిలువుటద్దములో నేను చూచుకొన్నప్పుడు, నాకు రోత ఏమీ కలుగలేదు. ఆ మూర్తికి స్వాగతమిచ్చెడి హర్షం నాలో కలిగింది. ఈ మూర్తి కూడా నాదే. అదికూడా సహజప్రకృతియే. అది కూడా నా మానవత్వమే. అసంపూర్ణ విభిన్న ద్వంద్వప్రకృతి నాలో యింతవరకూ ఉండి అది నా ముఖంలో కన్పిస్తూ ఉండేది. ఈ ముఖవైఖరియే నాకు చిరపరిచితమై, ఈ ముఖమునుబట్టియే నన్ను నేను గుర్తించుకుంటూ వచ్చాను. అటువంటి విభిన్న ప్రకృతిని ప్రతిబింబించెడి ముఖవిలాసంకంటె, యీ కొత్త అవతారములో నా అంతరంగం ఎక్కువ జీవకళతో ఉంది. ఏదో ఒక్కప్రకృతియే విస్పష్టంగా యిందులో తాండవిస్తోంది. ఇంతమేరకు నేను చేసిన తత్వవిచారణ సవ్యంగానే ఉంది. నేను ఎడ్వర్డు హైడ్ రూపంలో

(39-వ పేజీ చూడండి)

# అద్దం మీద ఆవగింజ

గూడవల్లి భాస్కర్

ఆలుమగల మధ్య తగవు 'అద్దం మీద ఆవగింజ' అంటారు. కాని, శారదా మోహనుల మధ్య వచ్చినతగవుమాత్రం అల్లాటిది కాదు. పైగా ఆ తగాదామూలంగా అనవసరపు ఆర్భాటం చాలా జరిగింది. అసలు తగాదాకయినా అట్టే పెద్దకారణం ఏమీ లేదు. ఎవరన్నా విన్నా నవ్విపోతారు కూడా: ఏం జరిగిందంటే—

రాత్రి 8 గంటలవుతుంది. శారద భోజనానికి పిలిచింది. మోహనరావు వచ్చి పీటమీద కూర్చున్నాడు. తను చేయమన్న బంగాళాదుంపల వేపుడు తప్పని సరిగా చేసుంటుందని అతని నమ్మకం. నోరు తెగ వూరిపోతోంది. కాని శారద పళ్ళెంలో వంకాయకూర వేసింది. ఆ కూర చూడగానే మోహనరావు ముఖమంతా ముడుచుకుపోయింది. జిహ్వా చివుక్కున పీక్కుపోయింది.

"బంగాళాదుంపలవేపుడు చేయలేదా...?" అన్నాడు మోహనరావు, ముఖం పైకెత్తి కళ్లు ఎర్ర చేస్తూ.

"ఊఁహూఁ..." అన్నది శారద ముక్తసరిగా.

"ఏం చేత?" అన్నాడు మోహనరావు, మంచినీళ్ళ గ్లాసు జానెడు పైకెత్తి నేలమీదికి దభేల్న పడేస్తూ.

"గ్లాసు బద్దలు చేసుకుంటారెందుకూ," అన్నది శారద పరుషంగా.

"విదేశీ సోప్ తెమ్మంటే, ఈ పాడు సబ్బు ఎందుకు తెచ్చారూ?" అన్నది మళ్ళీ, బరిలోకి దిగుతూ.

"నాకు తెలియక అడుగుతాను, సబ్బుకీ కూరకీ సంబంధం ఏమిటీ?" అన్నాడు మోహనరావు నిగ్గతీస్తూ. అప్పటికే కారం రాసుకున్నట్లుగా వున్నది మోహనరావుకు.

"అవును నే తెమ్మన్న సబ్బు తేలేదు కాబట్టి, మీరు వండమన్న కూర నేను వండలేదు" అన్నది శారద, అక్కడినుంచి వంటగదిలోకి వెళ్ళిపోతూ.

మోహనరావు, పీటమీదే కూర్చొని కొంతసేపు మధనపడ్డాడు. కోపంతో కుతకుతలాడిపోయాడు. ఆవిడ కోరిన సబ్బు తేనందుకు, కూర చేయకపోవటం ప్రాయశ్చిత్తం అన్నమాట!...ముందున్న అన్నపు పళ్ళెన్ని గోడకు కొట్టి, గబగబా బయటకు వచ్చేశాడు.

బయట చీకటి దట్టంగా అలుముకుంది. మునిసిపల్ దీపాలు వాటి శక్తికొద్దీ చీకటిని తరిమికొడుతున్నాయి. మోహనరావుకి ఆకలి దహించుకుపోతోంది. దగ్గరలో వున్న ఒక హోటలుకు పోయి భోజనం చేశాడు. మితిమీరిన ఉద్రేకంలో వుండటంచేత భోజనం ఏమీ సహించలేదు. టైమ్ చూసుకొంటే పదిగంటలయింది; మనస్సేమీ బాగుండలేదు. రెండో ఆట సినిమా చూడొచ్చు ననుకున్నాడు. వెళ్ళి సినిమాచూసి ఒంటిగంటకి యింటికి చేరుకున్నాడు. ఆ రాత్రికి ఎంతో ప్రయత్నంమీదగాని నిద్రపట్టలేదు.

ఉదయాన్నే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, స్నానానికి తనే నీళ్లు తోడుకొని స్నానం చేశాడు. రోజూ శారదే నీళ్లు తోడేది. ఈరోజున శారద నీళ్లు తోడనూలేదు, తను తోడమని అడగనూలేదు. స్నానం చేశాక, పోయి కుర్చీలో కూర్చొని ఆఫీసుకాగితాలు చూసుకొంటున్నాడు. కాని మనస్సుమాత్రం "కాఫీ" మీదకే లాగుతోంది. అప్పటికే 'కాఫీ' టైమ్ మించి అరగంటయింది. శారద అసలు కాఫీ తయారుచేస్తోందో లేదో? పోయి హోటల్లో తాగటమా? లేక కొంతసేపు వేచివుండటమా?

శారదగది మండిగందాకావచ్చి, తలుపుచాటుగా తనేమీ కనుపించకుండా నిలుచుని 'కాఫీ' గ్లాసు గదిలోకి నెట్టి వెళ్ళిపోయింది. మోహనరావు 'కాఫీ' కేసి కాసేపు కోపంగా చూసిచూసి, గబుక్కున గొంతులో పోసుకొని, పదిగంటలదాకా తన పని చూసుకున్నాడు. ఆఫీసు టైమ్ అయింది. ఇంకా భోజనం చేయలేదు. ఏమాత్రం ఆలశ్యంచేసినా ఆఫీసర్ చేత చివాట్లు తప్పవు. ఏమీ

తోచక గదిలో అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు. శారద తలుపు ప్రక్కగావచ్చి అతని ముందు ఒక చీటీ విసిరేసి, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. మోహనరావు చీటీ తీసుకొనిచదువుకున్నాడు: "భోజనం తయారయినది-వచ్చిభోజనం చేయవచ్చు" అని వంకరటింకర అక్షరాలతో వ్రాసివుంది ఆ చీటిలో.

మోహనరావుపోయి పీటమీద కూర్చున్నాడు. అంతకు ముందే, పళ్లెంలో అన్నంపెట్టి కూరలు, యితర భోజ్యాలన్నీ రకరకాల గిన్నెల్లోపెట్టి పళ్లెంచుట్టూ పేర్చివున్నాయి. అంటే, తనకేమి కావాలన్నా శారదను పిలవకుండానే, భోజనం పూర్తిచేసి వెళ్లిపోవాలన్నమాట! తను పలకరించినా ఆవిడ పలకదలచలేదు కాబోలు. సరే, కానీ! - తనుమాత్రం తక్కువ తిన్నాడా? ఎన్నాళ్లు ఇట్లా జరుగుతుందోచూద్దాం - అని మనస్సులో అనుకున్నాడు. గబగబా భోంచేసి, కోటు తొడుక్కొని ఆఫీసుకు వెళ్లిపోయాడు.

* * *

భార్యాభర్తల మధ్య మాటా పలుకు లేకుండా మూగనోము బాగా ప్రజ్వరిల్లిపోయింది. ఒకరికొకరు చీటీలు వ్రాసి యిచ్చుకోటంతో దైనందిన అవసరాలు గడిచిపోతున్నాయి. నిత్యమూ భార్య పంపే 'టపా' సింహావలోకనం చేసుకోవటం, వాటికితగినసమాధానాలు వ్రాయటం, మోహనరావు దిన



శారద తలుపుప్రక్కగావచ్చి అతనిముందు ఒక చీటి విసిరేసి గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది.



'జై హింద్'

చిత్రకారుడు: అల్లమోలు కొండలరావు, గునుపూడి.

# ★ అద్దంమీద ఆవగింజ ★

చర్యలో ప్రధానపాత్ర వహించింది.

మామూలుప్రకారం ఉదయాన్నే లేచి, డ్రాయరుమీదవున్న చీటీలను కడుశ్రద్ధగా చదువుకున్నాడు:

"ఇవ్వాల్టితో బియ్యంపూర్తిగా నిండుకొన్నాయి. వెంటనే తేక పోతే పస్తుపడుకోవలసివస్తుంది"

"ఇస్త్రీచాకలిది డబ్బులకి రోజూ ధామ్ ధూమ్‌లు చేస్తూవుంది. దానికి మూడున్నరదాకా యివ్వవలసి యున్నది"

"ఫేస్ పౌడర్" అయిపోయింది. ఒకటిన్ను తప్పక తేవాలి."

"బజారులోకి కొత్తరకం పట్టు చీర వచ్చింది. ఆ చీరెకుగాను, నాకు ముప్పైరూపాయలు కావాలి"

మోహనరావు అన్నిటికీ తగు సమాధానాలు వ్రాసి డ్రాయర్ మీద పెట్టేశాడు. ఇంకా కొద్దిపాటి ఆఫీసుపని వుంటే - అది చూచు కున్నాడు. ఆఫీసుటైమ్ కావటంచేత, భోజనానికి ఉపక్రమించాడు. మామూలుప్రకారం ఒకపీట - పీట ముందు పళ్లెం - పళ్లెంచుట్టూ కూరల గిన్నెలూ పేర్చి వున్నాయి. కూరలు కలుపుకుంటే గొడ్డుకారం కలుపు కున్నట్లుగా వున్నాయి. రుసరుస లాడుతూ సగంలోనే లేచి ఆఫీసుకు వెళ్లిపోయాడు.

భర్త రుసరుసలాడినందుకు శారద ఏమీ చలించలేదు. సగం అన్నం తిని లేచిపోయినందుకు, ఏమాత్రం నొచ్చుకోనూలేదు. కావాలనే శారద కూరల్లో ఉప్పో, కారమో ఎక్కువ వేస్తోంది. ఈ కూరలు తిన లేక తనభర్త, నిదానిగి ప్రాధేయ పూర్వకంగా పలకరించి రాజీకి వస్తా డేమోనని ఆశపడింది.

భర్త ఆఫీసుకు వెళ్లిపోయాక, తన గదిలోకి పోయి భర్త వ్రాసి పెట్టిపోయిన చీటీ చదువుకుంది:

"నిన్న చేసిన కూరలో ఉప్పు ఎక్కువగా వుంది. కావాలనే ఎక్కువవేస్తున్నావేమో నాకు తెలి యదు. కూరలు ఇట్లాగే తయారు చేసేట్లయితే, నేను హోటల్లో భోజనం చేయాల్సి వుంటుంది".

"ఇవ్వాల్టి కాఫీ"లో పంచదార ఎక్కువగా వుంది. ఇంతింత పంచ దారవేస్తే నేను త్రాగలే" నని నీకూ తెలుసు."

"నీ వడిగిన చీరెకు నాదగ్గర డబ్బులేదు. ఎంత జీతం వచ్చేవాడి కయినా, బజారులోకి వచ్చిన ప్రతీ కొత్తరకం చీర కొనటం అసాధ్యం."

"ఫేస్‌పౌడర్ టిన్ను యివ్వాళే తెస్తానని వాగ్దానం చేయలేను. నెల జీతం వచ్చాక చూద్దాం."

"బియ్యానికీ - ఇస్త్రీ చాకలికీ గాను, పది రూపాయలు ఈడ్రాయ రులో పెడుతున్నాను."

చీటీ చదువుకున్నాక భర్తమీద మాంచి ఉక్రోషం వచ్చింది శార దకు. ఇంత కటువుగా సమాధానం యిస్తారా? తనుమాత్రం అంత కటు వుగా సమాధానం వ్రాయ కూడదూ? వెంటనే శారద వాటికి సమాధానం వ్రాయటం మొదలు పెట్టింది:

"కూరలో ఉప్పు ఏమాత్రమూ

(54-వ పేజీ చూడుడు)

# ★ మనిషిలో మనిషి ★

(35-వ పేజీ తరువాయి)

ఉన్నప్పుడు నా అవయవ నిర్మాణం చూచినవారు తొట్రొల్లి నన్నుగూర్చి అనుమానించక మానరు. నా బుద్ధికి తోచినంతవరకూ, అందుకు గల కారణ మేమిటంటే, మనకు యీ లోకంలో తటస్థపడే మనుష్యులందరూ సత్స్వభావం దుస్స్వభావం రెండూ సమ్మిళితమైన ప్రకృతికలవారే. కాని, మానవకోటి అంతటిలోనూ ఎడ్వర్డు హైడ్ అనేవాడొక్కడు మాత్రమే కల్తీలేని దుస్స్వభావం కలవాడు.

నిలువుటద్దంవద్ద నేనొకక్షణం నిలువబడ్డాను. అసలు అంత్యసారాంశమును తేల్చగల రెండవ పరిశోధన నేనింకా చేయవలసియే యున్నది. నా నిజ స్వరూపమును నేను తిరిగీ పొందుటకు వీలు లేకుండా పోగొట్టుకున్నానా ? ఇకముందు నాది కాజాలనట్టి యీ యింటిలోనుంచి నేను పారిపోవలసిన దేనా ? తొందర తొందరగా నా కచ్చేరీ గదిలోనికి వెళ్ళి, ఆమందునే మరొకమోతాదు తయారుచేసి గిన్నెడు మందును తిరిగి త్రాగివేశాను. తిరిగి నాకురూపాంతర పరివర్తనా వేదన ప్రారంభమైంది. తిరిగి హెన్రీ జెకిల్ ముఖంతో, ఆకారంతో, విగ్రహం తో, స్వభావ లక్షణములతో నేను యథాస్థితికి వచ్చాను.

ఆరాత్రి నాస్థితి ఎట్లా ఉందంటే నేను వేసే ముందడుగులో, నా సోపానపటంలో, అటు నిచ్చెన యిటు పాము అన్నట్లుంది. నేను యీ నూతన పరిశోధనలను ఎక్కువ ఉదారాశయములతో సాగించి యుండినట్లయితే, పుణ్యచింతతో పరోపకారచింతతో నేనీపరిశోధనలకు సాహసించి యుండినట్లయితే, కథంతా మరొకవిధంగా జరిగేది. ఇటువంటి రూపాంతర జననమరణ వేదనమూలంగా చిట్టచివరకు నేనొక పిశాచముగా పరిణమించుటకు బదులు దేవతారూపంతో పర్యవసానం పొందియుండెడివాడను. నేను కనిపెట్టిన ఔషధమునకు విచక్షణా శక్తిలేదు. దానిలో దేవత్వముగాని, రాక్షసత్వముగాని ప్రత్యేకంగా ఏమీలేదు. మన అంతరంగంలోని నైజ ప్రకృతిని ఆవరించియున్న యీ బొందెను భేదించే గుణంమాత్రం దానికి ఉంది. మన అంతరంగంలో ఏ ప్రకృతిబంధితమై ఉంటే, ఆప్రకృతికి స్వేచ్ఛావిహారావకాశమును ఆ మందు కల్పిస్తుంది. నేను ఆ మందును పుచ్చుకొన్న ముహూర్తంలో నాయందు గల సత్స్వభావం మందగతిలో నిద్రపోతూ ఉంది. నాలో ఉండిన దుస్స్వభావం ఆ ఘడియలో బాగా చురుకుగా ప్రకోపించి, నాపరిశోధనాఫలితముల ప్రభావం చూడవలెననే ఆశతో ప్రజ్వలించి ఉంది. అందువల్ల ఆసమయంలో నాలోనుంచి ఆవిర్భవించినమూర్తి ఎడ్వర్డు హైడ్ - నాకిప్పుడు రెండుమూర్తులూ, రెండు తత్త్వాలూ ఉన్నప్పటికీ, అందులో ఒకటి పూర్తిగా దుస్స్వభావ పూరితం అయిఉన్నది. రెండవమూర్తి అసలు హె. నీ



తోడేలు పిల్ల

—ఫోటో: యస్. యస్. శర్మ, తెల్ప్రోలు.



# మనిషిలో మనిషి



జెకిల్ యొక్క మూర్తియై యున్నది. ఈ రెండవమూర్తి ఒక అసంబద్ధమైన మిశ్రస్వభావప్రకృతి - దానిని సంస్కరించవలెనని చాలా అవస్థపడి చివరకు నిరాశ జెంది ఆపని విరమించాను. అందువల్ల నాకృషి, నా ఉద్యమం అంతా, అధోగతికే దారిచూపింది.

ఆ దినాలలోకూడా, విద్యావ్యాసంగమూ, చదువూ అంటే నాకు తలనొప్పిగా అయిష్టంగానే ఉంటూ ఉండేది. ఈ గ్రంథపఠన విముఖత్వమును నేను జయించలేదు. తరచు విలాసంగా కాలం గడపుటకే ఉత్సాహపడుతూ ఉండేవాడిని. నామనస్సు కోరెడి సరదాలన్నీ పరువు మర్యాద శూన్యమైనవి. నేను పదిమందిలో చాలా గౌరవింపబడుతూ, పేరు ప్రసిద్ధిపొందినవాడ నగుటచేతనూ, వయస్సులో పెరిగి పెద్దవాడ నగుచుండుటచేతనూ, నాప్రవర్తనలోని అంతర్గత బహిర్గత స్వభావములకుగల విరుద్ధలక్షణం నానాటికి మరింత అయోగ్యమై అసహ్యమై పోతోంది. ఈ దుష్టప్రకృతి ప్రభావమును రుచిచూడవలెననే దిలాసాతోనే, నేనీ క్రొత్తశక్తిని పరిశోధించి చూచాను. అందువల్ల నేను ఆ దుస్స్వభావానికి బానిసనైపోయినాను. పేరు ప్రఖ్యాతి పొందిన ప్రొఫెసరుయొక్క అవతారమూర్తిని విసర్జించి, ఎడ్వర్డు హైడ్ యొక్క ఆకారమూర్తిని ఒక పెద్ద బురఖావలె తగిలించుకొని విహరించేనిమిత్తమై, ఒక గిన్నెడు మందు త్రాగితే చాలు. ఈ పరిణామ విచిత్రంచూచి నాలో నేనే నవ్వుకొన్నాను. అప్పట్లో నాకిది నవ్వులాటపనిగా ఉండేది. ఈ కామరూప కలాపమునకు కావలసిన ఏర్పాట్లన్నియు అత్యంతశ్రద్ధతో చేశాను. సోహో చౌకులో ఏయింటివద్దకు పోలీసువారు హైడ్ కొరకై వెతకుచూ వచ్చియుండిరో, ఆయింటిని నేను కొని, దానికి కావలసిన మేజాసామగ్రుల నన్నింటిని అమర్చినాను. ఎప్పుడూ మూగనోము పట్టినట్లుగా మౌనంగా ఉండి, ఏ పాడుపనికైనా సంకోచించనటువంటి ఒకమనిషిని ఆయింటికి కాపలాదారుగా ఏర్పాటు చేశాను. ఇక నా రెండోపక్షంలో, నాయింటి నవుకర్లందరికీ ముందుగానే హెచ్చరిక చేశాను, నేను నామకరణం చేసినటువంటి హైడ్ అనేవాడు ఆచౌకులో నాయింటియందు స్వేచ్ఛగా విహరించుటకు ఏవిధమైన అభ్యంతరములను కల్పించకూడదని నా నవుకర్లకు తెలియజేశాను. ఏమైనా అఘాయిత్యాలూ, అవాంతరాలూ అజ్ఞానంచేత కలుగునేమో అనే భయంచేత, నన్ను నేనే యీ రెండో ఆకారంలో నలుగురికీ చిరపరిచితుణ్ణిగా చేసికొన్నాను. అటుపిమ్మట, నీవు ఆక్షేపించినట్టి వీల్లునామాను తయారుచేశాను. ఎందుచేతనంటే, డాక్టర్ జెకిల్ ఆకారంలో ఉన్నటువంటి నాకు ఏదైనా ముప్పు తటస్థించినట్లయితే, ఏవిధమైన సొత్తు నష్టమూ లేకుండా ఎడ్వర్డు హైడ్ పేరుతో నా ఆస్తికి నేను కర్తను కావచ్చు. ఈవిధంగా సర్వతోముఖమైన బందోబస్తులు చేసికొని, నాకు ఉన్నటువంటి గౌరవ హోదాల ప్రయోజన లాభంకూడా పొందగల్గినాను.

ఇంతకాలంనుంచీ ఎవరైనా పెద్ద మనుష్యులు పెద్ద నేరాలను జరిపించవలెనంటే, కొందరు అఘాయిత్యాలను సాహసులను ఆ పనికి నియమించి జరిపిస్తూ వచ్చారు. తాము మాత్రము ఏవిధమైన అపఖ్యాతి లేకుండా దాగిఉండేవారు. కాని, సొంత సరదాకోసం అటువంటి ఘోర నేరములను స్వయంగా చేసినవాణ్ణి తొల్దొల్తగా నేనే.

లోకదృష్టిలో చాలా సదయహృదయుడ ననిపించుకొని గొప్ప గౌరవంతో బ్రతుకుచున్న నేను, ఒక్క క్షణంలో, బడిపిల్లవాడు తన పుస్తకాలు గిస్తకాలు అవతల పారవేసి, ఆటల్లోకి దిగినట్లుగా; స్వైరవిహారప్రవృత్తిలోకి దిగగల్గినవాడిని మొట్టమొదట నేనే. నాకై నేను కల్పించుకున్న ఆకారమూర్తి అభేద్యమైన దగుటవల్ల నా భద్రత కేమీ లోటులేదు. నాకొక శరీరం అనే ఉపాధి లేనేలే దనుకోండి. అప్పుడు కథంతా ఎట్లా ఉంటుందో యోచించండి. ఒక్కసారి నాపరిశోధనాగారంలోనికి శరీరం వెళ్ళనిస్తేఒకటి రెండుక్షణాలు నాకు వ్యవధియిస్తే, అక్కడ సదా సిద్ధంగా ఉండే మందు మోతాదును తాగనిస్తే, ఎడ్వర్డు హైడ్ అనేవాడు ఏవిధమైన దుర్మార్గములను చేసియుండినప్పటికీ, హుష్! మహాకాళీ అన్నట్లుగా ఎడ్వర్డు హైడ్ అనేవాడు అంతర్ధానమైపోతాడు. అతనిస్థానే సవ్యంగా స్వగృహంలో తన పఠనమందిరంలో దీపపువత్తిని చక్కజేస్తూ, లోకుల

అనుమానాలనుచూచి తనలో తాను నవ్వుకుంటూ, హెన్రీ జెకిల్ ప్రత్యక్షమవుతాడు.

నా మారురూపంలో నేను సరదా పడిన వినోదకృత్యములన్నియు, యింతకుపూర్వము సూచించినట్లుగా, కేవలం అప్రతిష్ఠపనులు—అంతకంటె వరుసంగా నేను వాటిని నిర్వచించలేను. కాని, ఎడ్వర్డు హైడ్ ద్వారా యీ పనులు జరగడం సంభవించేసరికి, అవి కేవలము రాక్షసకృత్యములైనాయి. ఈ సాహసకార్యములను నేను నిర్వర్తించి తిరిగి వచ్చిన తర్వాత, యీ మారురూపంలో నేను చేసిన ఘాతుకములకు నేనే ఆశ్చర్యపడ్డాను. నా అంతరాత్మలో నుంచియే నేను ఆవిర్భవింపజేసినటువంటి యీ పరిచిత వ్యక్తిని అతని యిష్టానుసారం యథేచ్ఛగా విహరించి వ్యవహరించుటకు విడిచి పెట్టాను. ఈవ్యక్తి ఉద్భవించడమే దుష్టుడై పరమ పాపండుడై ఉద్భవించాడు. అతడు చేసే ప్రతిపని, అతని మనస్సులోని ప్రతి ఊహ స్వలాభానికి స్వప్రయోజనానికి మాత్రమే సంబంధించినదై ఉంటుంది. మరొకనిని ఎటువంటి క్రూరహింసలకైనా పాల్పడజేసి అడవిమృగంలాగున ఆనందిస్తాడు. దయారసంలేని మొండిరాతిగుండె—ఎడ్వర్డుహైడ్ చేసే దురాగతములను తలపోసి, హెన్రీ జెకిల్ నిర్ఘాంతపోయేవాడు. కాని, యీ దుర్మార్గములన్నియూ సాధారణ న్యాయచట్టములకు అతీతమైన పనులు. అందువల్ల అవి నా అంతరాత్మను అంతగా బాధించేవి కావు. అటువంటి దుష్కార్యములను చేసిన నేరస్థుడు హైడ్. ఆ నేరములకు హైడ్ మాత్రమే బాధ్యుడు. కాని జెకిల్ ఏమంత తీసిపోయినవాడు కాడు. జెకిల్ మరల సద్గుణమూర్తిగా తన ఉపాధిలోకి తాను వచ్చాడు. తాను హైడ్‌గా ఉండి చేసిన దుర్మార్గములకు కించిత్తయినా పరితపించని అంతరాత్మతో జెకిల్ తిరిగి యథాపూర్వస్థితిలో సిద్ధమైనాడు. హైడ్ చేసిన దుర్మార్గములకు, సాధ్యమైన సందర్భములలో, తగిన పరిహారం సమర్పించి బాధితుల కష్టనష్టములను తొలగించుటకై జెకిల్ సత్వరంగా పూనుకొంటూ ఉండేవాడు. ఈవిధముగా జెకిల్ యొక్క అంతరాత్మ మచ్చుమందు జల్లినట్లుగా మన్నుతిన్న పామువలె నిద్రాణంగా ఉంది. ఏయే అప్రతిష్ఠ పనులు జరుగుతూ ఉంటే నేను చూస్తూ ఊరుకున్నానో వానినన్నింటినీ ఇక్కడ పూసగుచ్చినట్లుగా వివరింప దలచుకోలేదు. ఆ దుర్మార్గములను చేసినది నేనే అని యిప్పుడుకూడా అంగీకరింపజాలను. కాని ఏవిధమైన ఘట్టపరంపరలతో ఏవిధమైన భావి సూచక హెచ్చరికలతో నా స్వయంకృతాపరాధ శిక్షను నేను అనుభవింపవలసివచ్చెనో వివరింపదలంచుకున్నాను. ఒకసారి ప్రమాదకర సంఘటన సంభవించింది. దానివల్ల కలిగిన దారుణ ఫలిత పర్యవసానం ఏమీ లేదు కనుక దానిని నామమాత్రంగా ఉదాహరించి వదలివేస్తాను. ఒక బిడ్డ విషయములో చాలా క్రూరంగా ప్రవర్తించియుండుటవల్ల దారిమార్గంగా పోతూఉన్న ఒక బాటసారికి నామీద ఆగ్రహం కలిగింది. ఆ పెద్దమనిషి నీకు జ్ఞాతియనియు బంధువని ఇటీవల నాకు తెలిసింది. ఆ బిడ్డ కుటుంబస్థులును, ఒక డాక్టరున్నూ ఆ మార్గస్థునితో ఏకమైనారు. నా ప్రాణం మీదకు ఎదైనా వస్తుందని నేను భయపడిన సందర్భములుకూడా ఉన్నాయి. వారి ఆగ్రహావేశమును శాంతింపజేయుటకుగాను, ఎడ్వర్డు హైడ్ తన యింటి గుమ్మంవద్దకు వారిని తీసికొనివచ్చి హెన్రీ జెకిల్ సంతకంతో ఒక చెక్కును (బ్యాంకుహుండీని) వ్రాసియిచ్చి వారికి పైకం చెల్లించడమైనది. కాని, యీవిధంగా మారుపేరుతో చెక్కులను ఇచ్చుట యనెడి ప్రమాదం అటుపిమ్మట తిరిగీ సంభవింపకుండుటకై ఎడ్వర్డు హైడ్ పేరుతోనే మరొక బ్యాంకులో ఖాతా ఏర్పాటుచేశాను. నా దస్తూరీ అక్షరములనే వెనుకవైపుకు ఏటవాలుగా వంచి వ్రాయుటమూలంగా, నా రెండో అవతారానికి కావలసిన వేరొక దస్తూరిలో నేను సంతకమును చేయగల్గితిని. ఈవిధంగా నాదస్తూరీని మార్చడం మూలంగా బ్రహ్మ రుద్రాదులకు కూడా నేను పట్టుపడకుండా తప్పించుకోగలనని నిశ్చయించాను.

సర్ డాన్వర్సుగారి హత్య జరుగుటకు రెండు మాసాలు ముందుగా, ఒకనాడు, నా సాహస విహారాలకై నేను బయటకు వెళ్లియుంటిని. రాత్రి చాలా ప్రొద్దుపోయినతర్వాత యింటికి వచ్చాను. మరునాడు నేను పడకనుంచి లేచేసరికి నాకొక వింతస్మృతి వింత స్పృహ కలిగింది. నా చుట్టుప్రక్కల పరికించి చూచాను. కాని, ప్రయోజనం లేకపోయింది. చౌకులోని గదయొక్క భారీసైజు కొల్తలను అందలి మేజా



# మనిషిలో మనిషి



సామానులను పరికించి చూచాను. కాని, ప్రయోజనం లేకపోయింది. అక్కడ ఉండే మంచం తెరలను, చంద్రపుచెక్క చట్రమును చూచి గుర్తు పట్టినాను. నేను ఉండవలసిన ప్రవేశములో నేను లేను అని నాకేదో బుద్ధి చెప్పినట్లయింది. ఎడ్వర్డు హైడ్ రూపంలో ఉండేటప్పుడు నేను ఏ గదిలో నిద్రించుటకు అలవాటు పడినానో ఆ గదిలోనే—సోహో చౌకులోని ఆ గదిలోనే—నేను ఉన్నాననిన్నీ, నేను అనుకొన్న గదిలో నేను నిద్ర మేలుకోలేదనిన్నీ, గ్రహించాను. నాలో నేనే ఆత్మవిమర్శతో అంతర్గతంగా నవ్వుకొన్నాను. ఈ విభ్రాంతికిగల సందర్భ కారణములను విమర్శించుకొంటూ మైకంగా కూర్చున్నాను. అటువంటి జిజ్ఞాసావస్థలో సాధారణంగా తెల్లవారినతర్వాత నిద్రమత్తులో కునికిపాట్లు పడుతూ ఉండడం నాకు పరిపాటి. నాకు బాగా మెలకువవచ్చి జాగ్రదవస్థలోకివచ్చినప్పుడు నా చేయి నేను పరిశీలనగా చూడడం తటస్థించింది (మీ రిదివరలో తరచు వర్ణిస్తూ ఉండినవిధంగానే) హెన్రీ జెకిల్ యొక్క హస్తము అతని వృత్తికి తగిన తీరుగా భారీగా ఉంటుంది. అది కండపుష్టిగలది పెద్దది. తెల్లని తెలుపురంగుగలది. పసందైన చేయి అది. కాని నా కంటికి యిప్పుడు కన్పించిన యీ చేతిని, లండను నగర మధ్యభాగంలోని ఆ ఉదయం పూట, బంగారు నీరెండ కాంతిలో, సగం కప్పబడియున్న నా పడకగుడ్డల మధ్యనుంచి స్పష్టంగా చూచాను. ఆ చేయి చాలా సన్నంగా ఉంది. నరాలు పైకి ఉబ్బిఉన్నాయి. ముళ్లు పడినట్లున్నాయి. పొగమారిన రంగుగా ఉంది. చేతినిండా వెండ్రుకలు గుబురుగా మొలచిఉన్నాయి. అది స్పష్టంగా ఎడ్వర్డు హైడ్ చెయ్యి. నేను విస్మయాశ్చర్యములతో అదేపనిగా నిదానంగా ఒక అర నిమిషం సేపు దానితీరు చూస్తుండేవాడినే. కాని, ఒక భయం నా గుండెలో తాళాలు మ్రోగినట్లుగా మ్రోగి, నన్ను హెచ్చరించింది. వెంటనే నా పడకమీదనుంచి లేచి నిలువుటద్దంవద్దకు వెళ్లాను. ఈ అద్దంలో నాకండ్లకు కట్టినట్లుగా కన్పించినదంతా నేను చూచుకొనేసరికి, నేను నిలువున నీరైపోయినాను. అవును. నేను రాత్రి పరున్నప్పుడు హెన్రీ జెకిల్ అవతారంలోనే నిద్రపోయినాను. కాని, నిద్ర లేచేసరికి ఎడ్వర్డు హైడ్ అవతారంలో నిద్ర లేచాను. ఇది ఎట్లా సంభవించింది? అప్పటికే బాగా తెల్లవారిపోయింది. ఇంట్లో నవుకర్లు అందరూ లేచి తిరుగుతున్నారు: నా మందులన్నీ నా కచ్చేరీ గదిలో ఉన్నాయి. అక్కడికి నేను పోవాలంటే, రెండు మెట్లవరుసలు దాటి, వెనుకవైపు త్రోవగుండా, పెరటి ఖాళీ జాగాగుండా, శల్యతంత్ర పరిశోధనశాలగుండా పోవాలి. అక్కడినుంచి నేను



మహాబలిపురం లైట్‌హౌస్‌లోపలి సోపానాలు

—ఫొటో: వి. పుల్లేశ్వర్, విజయవాడ.

చాలా నివ్వెరపడి చూస్తూ నిలువబడి పోయినాను. నా ముఖమును నేను కప్పుకొని పోవచ్చు. నిజమే. కాని, నా ఆకారంలో కలిగిన యీ మార్పును నేను రహస్యంగా కప్పిపుచ్చుటకు వీలులేనప్పుడు ముఖాన్ని కప్పుకొన్నందువల్ల ప్రయోజనమేమిటి? అయితే, నా రెండో అవతారమూర్తి వస్తూ పోతూ ఉండడం నా నవుకర్లకు యిదివరకే చిరపరిచితమై యున్నది. ఈ విషయం నా మనస్సుకు స్ఫురించేసరికి నా మనస్సు కొంచెం తెప్పరిల్లింది. నా సైజుకు సరిపడే దుస్తుల తోనే నేను వీలైనంత వేవేగంగా ముస్తాబు చేసి కొన్నాను-నేను. ఆ ఇంటిలో నడచిపోతూఉంటే, నా నవుకరు బ్రాడ్షా నన్ను అక్కడ చూచాడు. ఇటువంటి వింతదుస్తులతో, ఇట్టివేళయందు యింటిలోకి హైడ్ రావడం చూచి, బ్రాడ్షా నావంక తేరి పారజూచి కొంచెం వెనుకడుగు వేశాడు. అటుపిమ్మట పది నిమిషములైనపిమ్మట డాక్టరు జెకిల్ తన స్వస్వరూపాన్ని తాను పొంది, తన నొసలు చిట్లిస్తూ, ప్రాతఃకాల భోజనం చేస్తున్నవైఖరిలో నటిస్తూ నేను కూర్చున్నాను.

నాకు ఆకలిమాత్రం బహు కొద్దిగా ఉంది. ఆనాడు నాకు కలిగిన అనుభవం అనగా, నా పరివర్తన సూత్రం తలక్రిందులై పోవడం అర్థంకాని అడివిగొడవగా ఉంది. నాకు రానున్న యమదండన, గోడమీద లిఖించి చూపినట్లుగా, యీ అనుభవంవల్ల భయంకరంగా నాకు గోచరించింది. నా ఉపాధిద్వయమునుగూర్చియు, దాని సాధక బాధకములను గూర్చియు, పూర్వంకంటె యిప్పు డెక్కువ తీవ్రంగా నేను పర్యాలోచించుటకు ప్రారంభించాను. నాలో అంతర్గతమైన ఏ దుస్స్వభావమును నేను ప్రత్యేక రూపంలో పరిస్ఫుటం చేయగల్గుతున్నానో ఆ దుస్స్వభావం యిటీవల ఎక్కువ తరుచుగా మూర్తీభవించి ఎక్కువ సాధకంలో ఉండుటవల్లను, అది ఎక్కువ ప్రోత్సహింపబడి పోషింపబడిన దగుటవల్లను, ఇటీవల డా॥ హైడ్ యొక్క మూర్తి పెరిగి పెంపొందినట్లుగా ఆ మూర్తిని నేను దాల్చినప్పుడు నాకు కన్పించింది. నా రక్తంలోనే ఒక ఉధృతం విస్తృతం కలిగినట్లుగా నేను గ్రహించాను. ఈవిధమైన అవతార పరివర్తనమును ఇంకా మరి కొంత దీర్ఘకాలం నేను సాధకం చేసినట్లయితే, నాలో ఉన్న రెండుప్రకృతులయొక్క హెచ్చు తగ్గుల తక్కెడ తలక్రిందులై ఆ తారుమారే స్థిరస్థాయిగా ఉండగల దనెడి ప్రమాదం నేను పసిపట్టితిని. అట్టి స్థితిలో యథేష్టంగా స్వసంకల్పానుసారంగా నా మూర్తిని నేను మార్చుకో గల శక్తి నాకు లేకుండా పోతుంది. ఎడ్వర్డ్ హైడ్ యొక్క ప్రకృతిస్వభావమే శాశ్వతంగా నాకు స్థిరపడి పోగలదు. నా ఔషధప్రభావం ఏకతీరుగా పనిచేయడం లేదు. ఆరంభదశలో ఒకసారి, ఆమందు నాకు పనిచేయనేలేదు. అందువల్ల అది మొదలుగా నా ఔషధపుమోతాదును నేను రెండింతలుచేసి వాడవలసి వచ్చింది. ఒకపర్యాయము నా ప్రాణంమీదకు ఉపద్రవం తెచ్చిపెట్టుకొనుటకైనా సిద్ధపడి యీ ఔషధపు మోతాదును మూడురెట్లుగా హెచ్చించి సేవించవలసి వచ్చింది. నా ఆకారపు పరివర్తనమును ఎవ్వరూ గుర్తు పట్టలేరనే నమ్మకంవల్ల కొంత ఆత్మధైర్యం నాకు లీలగా యింతవరకూ ఉంటూఉంది. ఇప్పుడీమందు మోతాదుయొక్క ప్రభావం అనిశ్చయం అయి పోతూఉండడంవల్ల, నాకు లీలగాఉంటున్న ఉంటున్న ఆత్మధైర్యంకూడా తొలగిపోయింది. ఆనాడు నాకు కలిగిన యీ ఆకస్మికానుభవ విశేషంమూలంగా నేనొక విషయం గమనించవలసి వచ్చింది. డాక్టరు జెకిల్ యొక్క మూర్తిని మరొకమూర్తి లోనికి మార్చుచేసి అవస్థాభేదం పొందడం ఎట్లనేదిమాత్రమే యింతవరకూ నా మనస్సును బాధించిన సమస్య. కాని, యిప్పు డా సమస్య తలక్రిందులై యిటునుంచి అటు తిరిగింది. నా ప్రస్తుత పరిస్థితులన్నియు యీ క్రింది పర్యవసానంలోకి వచ్చాయి. నాలో ఉన్న సత్స్వభావంమీద నాకు పట్టు తప్పిపోతోంది. నాలో ఉన్న రెండవప్రకృతి యగు దుస్స్వభావంతో నేను క్రమ క్రమంగా లీనమైపోతున్నాను.

(ఇంకా వుంది)

విజయా వారి "చంద్రహారం"లో మాలి ఎస్. వి. రంగారావు,
చందనరాజు ఎన్. టి. రామారావు, గౌరి శ్రీరంజని.



"చంద్రహారం"లో దేవకన్యలు కాంతాదేవి, సావిత్రి.



సినిమా వ్యాసం :

# ఫిలిములు - అభిరుచులు

[illegible]

కళారంగంలో ఒక వ్యక్తియొక్క, దేశం యొక్క విలువను అంచనా కట్టడానికి అభిరుచి ముఖ్యమైన ఆధారం. ఇండియా, ఈజిప్టు, గ్రీసుదేశాల శిల్ప విశిష్టతను గుర్తించాలంటే, ఆదేశాలు ఆయాకాలాల్లో నిర్మించిన ఆలయాలు, స్మృతి చిహ్నాలు, విగ్రహాలు పరిశీలించాలి. ఈ రోజుల్లో కూడా, ఒక దేశంలో పర్యటించి, ప్రజల్ని చూసి, వారి వేషం, భాష, ప్రవర్తన, సాంఘికజీవనం ఇవన్నీ పరిశీలించాలి; వారి సారస్వతం, సంగీతం, చిత్రలేఖనం, మొదలైనవి పరిశీలించి ఆ దేశానికి ఆయా కళల్లో మంచి అభిరుచి వున్నదీ లేనిదీ అంచనా కట్టాలి.

ఫిలిములు తీసుకుంటే, ప్రజాబాహుళ్యాన్ని ఫిలిములు ప్రతిబింబించినంత బాగా మరే కళా ప్రతిబింబించదని చెప్పవచ్చు. వివిధదేశాల ఫిలిములను పోల్చి చూడడంవల్ల ఆయాదేశాల అభిరుచుల్లో గల తేడాలు కనిపెట్టవచ్చు. ముఖ్యంగా అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ, రష్యా, జపాను, ఇండియా దేశాల ఫిలిములను ఇప్పుడు పరిశీలిద్దాం.



ఏ పి వే కా వారి "పెళ్ళిపెద్దలు"లో చంద్రశేఖరం, లీలారాణి.

అమెరికా:— తదితర దేశాల ఫిలిముల కంటె అమెరికన్ ఫిలిములు ఈ దేశంలో ఎక్కువ ప్రదర్శింపబడుతున్నాయి కనుక మీలో చాలమంది అవి చూసివుంటారు. అమెరికన్ ఫిలిములు చూస్తుంటే, జల్సాగా, ఖుషీగా జీవించడమే ఆశయంగాగల వ్యక్తులు కనిపిస్తారు. దీనికి కారణం ఆ దేశపు ఆర్థిక సౌభాగ్యమే. ప్రతి అమెరికనూ జీవితంలో ప్రతిదీ అతి త్వరితంగా జరిగిపోవాలని వాంఛించడం, నిత్యమూ కొత్త ఆనందాలకోసం అన్వేషించడం అమెరికన్ ఫిలిములలో కనిపిస్తుంది. శాస్త్రీయమైన పద్ధతుల్లో జీవించడం, కుటుంబ జీవితంలోకి కూడా సరికొత్త పద్ధతుల్ని దిగుమతి చేయడం, అమెరికన్లకు జీవితపరమావధి అయినట్టు తోస్తుంది. అమెరికన్ యువతులకు వేషధారణలో గల గ్లామరు చూస్తే ఆశ్చర్యకరంగా వుంటుంది. ఆకర్షవంతంగా వుండడంకోసం కొంచెం ఎబ్బెట్టుగావుండే పద్ధతినైనాసరే అవలంబిస్తారు. ఇదేకాక, తాజా అమెరికన్ చిత్రాలు చూస్తే ఆ దేశీయులకుగల ఒక విధమైన అహంభావం కూడా వ్యక్తమవుతుంది. ప్రపంచానికల్లా అమెరికా తలమానికమనీ, అమెరికన్ జీవన విధానమూ, ఆలోచనావిధానము ప్రతివారూ ఉత్తమంగా అంగీకరించి అవలంబించాలనీ వారి భావమైనట్టు కనిపిస్తుంది.

జపాను:— అమెరికన్ చిత్రాలు చూస్తే కలిగే అభిప్రాయానికి సరిగ్గా వ్యతిరేకంగా వుంటుంది జపానీస్ చిత్రాలవల్ల కలిగే అభిప్రాయం. జపానీస్ అభిరుచులు, స్వభావము, ఆలోచనా విధానము అతిసరళమైనవిగా, నిరాడంబరంగా వుంటాయి. వారి మేధాశక్తి అతి నిశితమైనది. అత్యధిక ధనవ్యయంతో అమెరికన్లు సాధించినదాన్ని జపానువారు అతి సులభోపాయాలతో, చిత్రపద్ధతితో సాధిస్తున్నారు. జపానువారికి వివిధ సాంస్కృతిక శాఖల్లో గల అభిరుచులు జపానీస్ చిత్రాలన్నిటిలోనూ ద్యోతకమవుతాయి. జపాను చిన్నదేశమైనప్పటికీ, యితరదేశాలతో పోల్చిచూస్తే జనాభాకూడా తక్కువైనప్పటికీ చిత్రాల నిర్మాణంలో అమెరికా తరవాత స్థానం జపానుదే. జపానీస్ చిత్రాలు చూస్తుంటే అక్కడి ప్రజలు తమ గృహాలు ఎంత అందంగా అలంకరించుకొనేదీ, ఎంత నిరాడంబరంగా జీవించేదీ, వస్త్రధారణ చేసేదీ బాగా తెలుస్తుంది.

ఇంగ్లండు:— బ్రిటిషువారు తమ భాషాసౌష్ఠవానికీ, అనూచానంగా వచ్చే దేశీయ సంప్రదాయానికీ ఎక్కువ ప్రాముఖ్యం యిస్తారని తేలిగ్గా గ్రహించవచ్చు. అందుకే బ్రిటిష్‌నిర్మాతలు తిరిగి తిరిగి షేక్స్పియరు నాటకాలు చిత్రీకరిస్తూంటారు. బెర్నార్డుషా నాటకాలు కూడా చిత్రీకరించడం వారికి ఆనవాయితీ అయింది. అంతర్జాతీయంగా అలెగ్జాండర్ కోర్డా, గేబ్రియల్ పాస్కల్ చెప్పుకోదగిన ప్రొడ్యూసర్లు. వ్యక్తి స్వాతంత్ర్యం, పౌరహక్కులు, శాశ్వతలు, బ్రిటిష్ జాతీయాచారాలు—వీటిపట్ల ప్రజలకుగల భక్తిగౌరవాలు ఆ దేశపు చిత్రాల్లో పూర్తిగా ప్రతిబింబిస్తాయి.

రష్యా:— బ్రిటిష్ చిత్రాలకు సరిగ్గా

# ★ ఫిలిములు - అభిరుచులు ★

విరుద్ధంగా వుంటాయి రష్యన్ చిత్రాలు. భిన్నభిన్న కథావస్తువులను చిత్రించే స్వాతంత్ర్యం, వ్యక్తిస్వాతంత్ర్యం, హక్కులు ఇవేమీ రష్యన్ చిత్రాల్లో కనిపించవు. వ్యక్తుల ఆలోచనను బయటివారెవరో కంట్రోల్ చేస్తున్నట్టు అనుమానం కలుగుతుంది. ఈ లోపాలున్నప్పటికీ, ఎక్కువగా ప్రచారం తప్ప మరేం లేనప్పటికీ, వాటికి విద్యావిషయికంగా మంచి స్థానం వున్నది. సామాన్య స్త్రీ పురుషులను విజ్ఞానవంతులను చేయడం, ఒకానొక గమ్యస్థానంకేసి పురోగమింప జేయడం— ఇవి రష్యన్ చిత్రాలకు ప్రధానప్రయోజనంగా కనిపిస్తుంది. తాత్కాలికంగా చూస్తే దీనివల్ల కొంత ఉపయోగం ఉన్నా ఆలోచనా వైవిధ్యం గాని మురుకుదనం గాని కనిపించకపోవడం గొప్ప లోపమేనని చెప్పాలి.

ఇటలీ :—"ఈ చిత్రం ఇటాలియన్ ఫక్కీలో వుంది," అని అనడం సాధారణంగా చలనచిత్రలోకంలో వినిపిస్తూ వుంటుంది. "బైసికిల్ థీఫ్" "బిట్టర్ రైస్" "షూ షైన్"లాంటి చిత్రాలు చూస్తుంటే నేటి ఇటాలియన్ ప్రజలు జీవితంతో నిరంతరం చేసే సంఘర్షణ కానవస్తుంది. దారిద్ర్యం, సామాన్య పౌరుడి యిబ్బందులు, ముఖ్యంగా జాతీయ దృక్పథంలో అరాజకం. ఈ మొదలైన యుద్ధానంతర సమస్యలన్నీ వారి చిత్రాల్లో కళ్లకుకట్టినట్టు కనిపిస్తాయి. తన చుట్టూ కనిపించే యీ పరిస్థితుల ప్రభావంవలన నేటి ఇటాలియను శుద్ధ వాస్తవికవాది అయినట్టు తోస్తోంది.

ఫ్రాన్సు:— ఫ్రెంచి చిత్రాలు చూస్తుంటే మన మింకా మధ్య యుగాల రొమాంటిక్ దినాల్లోనే వున్నామా, అని భ్రాంతి కలుగుతుంది. గత శతాబ్దాల్లో మహామహులైన ఫ్రెంచి రచయితలు సృష్టించిన సారస్వత ప్రభావం ఇప్పటివారినింకా వెన్నాడుతూనే కనిపిస్తుంది. రకరకాల ఫాషన్లకూ, రకరకాల ఉద్రేకాలకూ పారిస్ యింకా పుట్టినిల్లుగానే వుంది.

ఇండియా:— ఇప్పుడు స్వదేశీయ చిత్రాలను పరిశీలిద్దాం. మన చిత్రాలు మన అభిరుచులను ఎలా ప్రతిబింబిస్తున్నాయో, మన అభిరుచులను ఎంతవరకూ తీర్చి దిద్దుతున్నాయో చూద్దాం. భారతీయ చిత్రాలను సమగ్రంగా సమీక్షించడం తేలిక పని కాదు. మనదేశం వివిధభాషలు, వేషధారణలు, జీవనవిధానాలు, అలవాట్లు కల ప్రత్యేక ఖండం. చిత్రనిర్మాణం జరిగే వివిధ భారతీయ భాషాప్రాంతాలను తీసుకుని పరిశీలించడం మంచిదనుకుంటాను.

బెంగాల్:— మనదేశంలో తూర్పు ఇండియా కంపెనీ నెలకొంటున్న రోజుల నుండీ యూరపియన్ సంస్కృతితో పరిచయం ఏర్పరుచుకునే అవకాశం కలిగిన ప్రాంతం బెంగాలు. పాశ్చాత్య సాంస్కృతిక సంపర్కంవల్ల ఆ రోజుల్లోని బెంగాలీ యువకుల భావన విశృంఖలమై, గట్లు తెగి కొత్త ఆదర్శాలకేసి కొత్త ఆశయాలకేసి ప్రవహించింది. ఈ ధోరణి సారస్వతంలోను, ఆలోచనల్లోనూ కొత్తకొత్త మార్గాలు అన్వేషించడానికి వీలిచ్చింది. సంఘంలోని అవినీతిని తుడిచిపెట్టి సామాజికులను సంస్కరించాలనే గాఢ వాంఛ మతావేశంవలె ప్రబలింది. రాజా రామమోహన్‌రాయ్, కేశవచంద్రసేన్, దేవేంద్రనాథ టాగూరు మొదలగు దిగ్దంతులకు సంబంధించిన బ్రహ్మసమాజం ఆ రోజుల్లోనే పుట్టింది. సంఘసంస్కరణోద్యమంతో నైతికంగా కొత్తవిలువలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ విలువల ప్రభావం అప్పటి సారస్వతానికి కూడా సోకింది. సాహిత్యరంగంలో బంకించంద్ర, శరచ్చంద్రవంటి నవలా రచయితలు, డి. ఎల్. రాయ్‌వంటి నాటకకర్తలు, రవీంద్రనాథ టాగూరువంటి కవులు యీ ఉద్యమంలోంచి వచ్చినవారే.

బెంగాల్‌లో ఫిలిం పరిశ్రమ ప్రారంభమైనప్పటినుండి నేటివరకూ నిర్మించబడిన చిత్రాలు చూస్తే కథావస్తువులలో గల అనంత వైవిధ్యం గోచరిస్తుంది. సామాన్య ప్రజల ఆశలు, ఆశయాలు, సంఘర్షణలు అన్నీ వారి చిత్రాల్లో ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తాయి. గడచిన శతాబ్దాలలో బెంగాల్ రాష్ట్రం పెంపొందించుకున్న ఒక ప్రత్యేక అభిరుచి, సంస్కృతి, దృక్పథం వారి చిత్రాల్లో కూడా కనిపిస్తుంది.

మహారాష్ట్ర:— బెంగాలీల స్వభావానికీ, అభిరుచులకీ మహారాష్ట్రుల స్వభావాభిరుచులకీ చాలా తేడా వున్నది. మహారాష్ట్రుడు సంప్రదాయరీత్యా యోధుడు, సైనికుడు. మొఘల్ అధికారంపై శివాజీ నడిపిన తిరుగుబాట్లు, పీష్వాల చరిత్ర ప్రతి మహారాష్ట్రుడినీ ఉత్తేజితుడిని చేస్తుంది. ఆ రాష్ట్రంలోని జానపద కథల్లో కూడా విదేశీయుల అధికారంపై తిరగబడిన వీరుల సంస్తుతి ప్రబలంగా ఉంటుంది. చలన చిత్రాల్లో కూడా మహారాష్ట్ర వీరయోధుల

చరిత్రమే ఎక్కువ కనిపిస్తుంది. కొన్ని చిత్రాలు యిందుకు భిన్నంగా వున్నట్లని పించినప్పటికీ, వాటిలో కూడా అన్యాయంపై, నిరంకుశత్వంపై తిరుగుబాటు ధోరణే కనిపిస్తుంది. ప్రభాత్ వారి "వహాఁ" ఇందుకు మంచి ఉదాహరణ. సంగీతంలో, సాహిత్యంలో, చిత్రకళలో మహారాష్ట్రులు ఒక ప్రత్యేక అభిరుచిని పెంపొందించుకున్నారు. ఇదే వారి చిత్రాల్లో కూడా కనిపిస్తుంది.



అశ్వరాజ్ వారి "అన్నదాత"లో జమీందారుపుత్రుడు రంగబాబుగా చలం

తమిళం:—తమిళ చిత్రాలనుబట్టి తమిళుల అభిరుచి ఇదమిత్థమని తేల్చుకోలేము. శాస్త్రీయ సంగీతంపై మాత్రం వారికి ఎనలేని భక్తి వున్నట్టు గ్రహించగలం. ఉత్తర, మధ్య భారత ప్రాంతాల రాజకీయ సంక్షోభాలకి భౌగోళికంగా చాలదూరంగా వుండిపోవడం వల్ల శతాబ్దాలు గడిచినా తమిళుల ప్రశాంత జీవితం ఎలాటి మార్పునకూ లోనుకాలేదు. బహుశా అందుచేతనే తమిళులు సాధారణంగా మెదడుతో ఆలోచిస్తారు కాని, హృదయంతో ఉద్రేకించరు. బెంగాలీ, మహారాష్ట్ర చిత్రాల్లో కనిపించే సున్నితమైన రసపోషణం తమిళ చిత్రాల్లో కనిపించకపోవడానికి కిదే కారణం. కాని చెప్పుకోదగిన ఒక ప్రత్యేకత ఏమిటంటే, ప్రతి తమిళునికీ సంగీతంపై అభిరుచి వుంటుంది. సంప్రదాయసిద్ధమైన సంగీతమంటే తమిళుడు చెవికోసుకుంటాడు. తమిళ చిత్రాలుకూడా కొన్ని సంపూర్ణ సంగీత చిత్రాలు కావడానికిదే కారణం.

ఆంధ్ర:— ఇప్పుడు మన భాషా చిత్రాలను చూద్దాం. మనం నివసించే భౌగోళిక ప్రాంతం మన అభిరుచులను చాలవరకు కనిపిస్తాయి. సంగీతం తీసుకుంటే, ఒకే చిత్రంలో కర్నాటక, హిందూస్థానీ బాణీలు వినిపిస్తాయి. కథావస్తువులు వివిధంగా వుండడమే కాక, ముఖ్యంగా గ్రామ జీవనం చూపించే చిత్రాల్లో ఆంధ్ర సంప్రదాయాలు బాగా ప్రతిబింబిస్తాయి.

ఇతరదేశాల్లోను, మనదేశంలోని వివిధ ప్రాంతాల్లోను ఉత్పత్తి చిత్రాలను,



విజయవాడలో యీనెల 12, 13, 14 లలో జరిగిన తెలుగు భాషా సమితి పంచమవార్షిక బహుమతి ప్రదానోత్సవంలో గ్రంథకర్తలు బాలాంత్రపు రజనీకాంతరావు, హరి ఆదిశేషు, కంచి శేషగిరిరావు, ఎం. సంగమేశంగార్లు, శ్రీమతులు కోడూరు లీలావతి, బాలాత్రిపుర సుందరిగార్లకు బహుమతులు యీయబడినవి.

# ★ ఫిలిములు - అభిరుచులు ★

తీర్చి దిద్దినట్లు నా కనిపిస్తున్నది. అటు ఉత్తరంతో, ఇటు దక్షిణంలో, మరొకప్రక్క పడమటి సరిహద్దుల్లోవున్న మహారాష్ట్రులతో, కన్నడిగలతో మనకు సన్నిహిత సంబంధం వున్నది. దాక్షిణాత్యుల తార్కికశక్తీ, బెంగాలీల హృదయార్ద్రతా మనకు స్వాభావికంగానే అలవడినవి. బౌద్ధమతం దక్షిణానికి ప్రాకినప్పుడు మనం దానికి స్వాగత మిచ్చాం. బౌద్ధధర్మ ప్రభావానికి లోబడిన ఆంధ్రులు అత్యాద్భుతమైన విహారాలు, స్థూపాలు, ముఖ్యంగా అజంతా చిత్రకళా సృష్టించారు. ఆ తరవాత వచ్చిన శంకర రామానుజాది మతాచార్యుల ప్రభావంకూడా మనకు సోకింది. బ్రహ్మసమాజంవారి సంఘ సంస్కరణోద్యమం మన రాష్ట్రంలో వేళ్లు తన్నింది. మహాత్ముని స్వరాజ్యోద్యమంలో ఆంధ్రుల పాత్ర వేరే చెప్పనక్కరలేదు.

ఆంధ్రులు విశాలహృదయులని, సంకుచితత్వం ఎరుగరనివారనీ నా నమ్మకం. అతి ప్రాచీనమైన మన చరిత్రను తిరగేసి చూస్తే, మన మెప్పటికప్పుడు పాతను విసర్జించి కొత్తను స్వీకరించడం కనబడుతుంది.

తెలుగు చిత్రాలను పరిశీలిస్తే ఇది నిరూపితమవుతుందని నా విశ్వాసం. ఫిలిం పరిశ్రమ ఇతరప్రాంతాల్లో అడుగు పెడుతూనే ఆంధ్రప్రాంతంలోకూడా అడుగు పెట్టింది. ఆంధ్రలో ఫిలిమ్ పరిశ్రమ సైలెంటు చిత్రాలతో ప్రారంభమై, అతి త్వరగా టాకీలుగా పరిణమించింది. మొదట్లో మనవారు ప్రజాసామాన్యాన్ని ఆకర్షించగల పౌరాణికచిత్రాలు తీసేవారు. ఒకటి రెండు తప్ప మనకు చారిత్రిక చిత్రాలు లేనేలేవు. తరవాత మన నిర్మాతలు సాంఘికకథలు ఎన్నుకోవడం ప్రారంభించారు. ప్రస్తుతం మన కథావైవిధ్యంలోను, నిర్మాణ సంఖ్యలోను ఏ రాష్ట్రం వారికీ తీసిపోమని చెప్పవచ్చు. ఇందాక నేను చెప్పినట్లు, భౌగోళికంగా, చారిత్రికంగా మనకు ఏ అభిరుచులు అలవడ్డాయో, అవే అభిరుచులు మన చిత్రాల్లో కూడా వాటిలో ప్రతిబింబించే అభిరుచులను సమీక్షించడానికి యింతవరకూ ప్రయత్నించాను. కాని మరొక ముఖ్యవిషయం కూడా చెప్పవలసివుంది. చలన చిత్రాలు ప్రజాభిరుచులను రకరకాలుగా తీర్చి దిద్దుతాయి. ఒక హీరోయిన్ జుట్టు ముడివేసుకునే విధానం, ఆమె ఉపయోగించే కొత్త ఫాషన్ నగలు, బట్టలు, గృహాలంకరణ విధానము, గృహనిర్మాణ విధానము, ఇంకా ఎన్నో విషయాలను ప్రజలు చిత్రాలలో చూచి అనుకరించడం ప్రస్తుతం సర్వసామాన్యంగా జరుగుతున్న పనే. ★

# "ధన్యవాదము"

'రజని'

నే మాటకారిని గాను, సభలను
మరియు నేరనివాడనే,
నా పాటలల్లే ప్రజ్ఞకై బహు
మాన మందినవాడనై

నే పాడుదును గళమెత్తి, స్థాయులు
మూడు పైపై హెచ్చగా,
రాగమ్ము తీగలుసాగ, శ్రోతలు
బాగుబాగని మెచ్చగా!!

నే పాడుదును!!

కవిరాజ హంసగురు ప్రసాదము
కవనమై ఫలియించగా
ఆకాశవాణీ సేవలో, నా
గానఘోరణి మించగా !!

నే పాడుదును!!

శతపత్ర సుందర కావ్యకన్యక
సమితి మన్నన లందగా
సహజన్మి మాన్యుల సత్కృతులనహా
సన్నుతుల నే పొందగా!!

నే పాడుదును !!

సాతంత్ర్య విభవామోదమోహిత,
తల్లి భారతి పొంగులో
అభ్యుదిత రాష్ట్రానంద వర్ధిత,
అమ్మ ఆంధ్రి వెలుంగులో

సన్మానములు సద్యత్నముల ప్రో
త్సాహకములని తెలియగా,
ఉత్సవ సమాగత జన శుభాశీ
రక్షయాక్షత లాలయగా, !!

నే పాడుదును !!

## ★ సినిమా వార్తలు ★

### "పీటర్ పాన్"

ఆర్. కె. ఓ. రేడియోవారి "పీటర్ పాన్" టెక్నికలర్ కార్టూన్ చిత్రం ఈ నెల 25 నుంచీ ఓడియన్‌లో ప్రదర్శింపబడుతోంది. ప్రొడ్యూసరు వాల్ట్ డిస్నీ. జె. ఎమ్. బారీ వ్రాసిన నాటకం తీసుకుని, పిక్చరైజ్ చెయ్యడానికి అవసరమైన చిన్న మార్పులుచేసి, యీ చిత్రం తీయబడినది.

ప్రపంచంలో కల్లా అత్యంత మనోహరమైనది బాల్యం; మృత్యువుచేత, వార్ధక్యంచేత జయించబడనిది; నిత్యనూతనమైనది. నిత్యప్రవంతియైన బాల్యానికి ఆదర్శ ప్రతినిధి పీటర్ పాన్. అతడు ముగ్గురు పిల్లల జీవితంలో ప్రవేశించి వారిని తను నివసించే "నెవర్ లాండ్" కు తీసుకుపోయి బాల్యసహజమైన సాహస కృత్యాలలో పాల్గొనజేస్తాడు. ఈ సంఘటన ఆ ముగ్గురు పిల్లల జీవితంలోనూ మరపురాని మధురస్వప్నంగా మిగిలిపోతుంది.

ఈ చిత్రం బాలబాలికలకు ఉల్లాసకరంగా వుంటుంది.

ఈ చిత్రానికి ముందు వాల్ట్ డిస్నీ తీస్తున్న "ట్రూ లైఫ్ ఎడ్వెంచర్స్" పరంపరలో ఒకటిగా 'ఎలుగుబంటుల జీవన విధానం' చూపబడింది. ఇంతకుముందు వాల్ట్ డిస్నీ అడవిజంతువుల జీవితాన్ని చిత్రిస్తూ కొన్ని చక్కని వైజ్ఞానిక, వినోదదాయక చిత్రాలు తీశాడు. ఈ కొత్త 'షార్' కూడా వాటిమోస్తరుగానే వుంది. "బీవర్ వాలీ" అనే చిత్రంలోగావును,

# నిజానిజాలు

(10-వ పేజీ తరువాయి)

గనకే భయపడుతోంది. మీరేమంటారోనని. మెల్లిగా బుజ్జగిస్తే అదే బైట పెడుతుంది. నేను చెప్తాను చూడండి.

లలి: ఏమిటో? మా పాప అలాంటి పని చెయ్యదు మరి?

మల్లి: చెయ్యకపోతే మంచిదేగా... పాపా - ఇలారా...

పాప: ఏం తాతయ్యా? చదువుకుంటున్నాను.

మల్లి: మంచిపిల్లవు... చూడమ్మా - నీకోసం మంచి రిబ్బన్లు తెచ్చాను - మొన్న పట్నం వెళ్ళినప్పుడు.

పాప: ఏవీ? తీసుకొచ్చావా తాతయ్యా?

మల్లి: తీసుకొచ్చాను. ఎంతబాగున్నాయనుకున్నావు?

లలి: నువ్వు కలంతీసుకొస్తే యిస్తాట్ట...

పాప: తీసుకొస్తా... నాన్నా— కల మెక్కడుంది?

చల: ఎక్కడుందో చెప్పకుంటే రూపాయిస్తా నమ్మాయి.

మల్లి: రూపాయిపెడితే నీకో గౌను వస్తుంది. అవునా?

పాప: అట్టే రెండురూపాయి లుండాలి తాతయ్యా...

లలి: ఇంకేం మరి—లోపలికెళ్ళి తొరగా తీసుకురా పాపా...

చల: ఇది పరుగెత్తింది—నిజంగా తీసిందన్నమాట—

మల్లి: నేను చెప్పలేదూ? నాకు తెలుసు బాబూ...

లలి: ఏం పాపా - ఏమిటి తెచ్చావు?

పాప: గౌను— ఈ రకం కొనాలి నాన్నా...

మల్లి: అలాగేనమ్మా—మరి కలమేదీ?

పాప: ఏమో! నాకేం తెలుసు?

చల: పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకుండా, ముందాకలం తీసుకురా. లేకపోతే వీపు చీరేస్తాను తెలుసా?

పాప: (ఏడుస్తూ) నాకు తెలీదు నాన్నగారూ?

మల్లి: మీరట్లా కర్రదాన్ని బెదరగొట్టకండి. ఇట్లాయితే అదసలు నిజం మీతో చెప్పనే చెప్పదు.

లలి: మా అమ్మవు గదూ! చెప్పమ్మా!! నీకు తాయం పెడతాను. మెల్లిగా నా చెవులో చెప్పు, నాన్నారికి వినిపించకుండా ఏం? ఇట్లారా! ఊఁ చెప్పు ఎక్కడ పెట్టావ్?

ఒకరు: (బైటనుండి) చలపతిరావుగారు ఇంట్లో ఉన్నారాండీ...

చల: ఎవరూ? ఆఁ ఆఁ ఉన్నాను. రావొచ్చు.

ఒకరు: ఏంచేస్తున్నావోయ్ ఇంట్లో?

చల: రావోయ్ రాఘవరావు! ఏమిటిలా దయచేశావ్ ఈ పూటకి? రా కూచో.

రాఘవ: కూచోవటం గాదు. నేను వెళ్ళాలి.

చల: అంత అర్జంటుపని ఉన్నవాడివి, ఇక్కడికెందుకొచ్చావ్... కాస్త కాఫీ అన్నా తాగిపో. ఏమేవ్ త్వరగా కాఫీ పెట్టు.

రాఘ: మనలో మనకు మర్యాదలేమిటి గాని, ఆ పాప ఏడుస్తున్న దెందుకు?

చల: కలం తీసిందేమోనని చెప్పదామె. అందుకూ, ఆ ఏడుపు.

రాఘ: కలమంటే జ్ఞాపకమొచ్చింది. ఇదుగోనోయ్ నీ కలం. నువ్వు ఆఫీసులో మరిచిపోయావు గావును, ఇందాక నూరి గాడు తీసి నాకిచ్చాడు... నే నొచ్చింది కూడా కలమిచ్చిపోదామనే...వస్తాను... గుడ్ బై...

★



"సింఫొనీ ఆఫ్ ఫ్రాగ్స్" అనే మంచి సీక్వెన్సు చూశాము. ఈ చిత్రంలో కూడా, ఎలుగుబంట్లు గోక్కునే విధానాలు రకరకాలైనవి ఒకచిన్న సీక్వెన్సుగా చూపించబడ్డాయి.

* * *

నరసూ స్టూడియోవారు తమిళ, తెలుగు భాషల్లో ఒక చిత్రం తీస్తున్నారు. తాత్కాలికంగా దీన్ని ప్రొడక్షన్ నంబర్ వన్, లేక 'విషబిందు' అంటున్నారు. డైరెక్టరు శ్రీస్వామి. ఎస్. వి. రంగారావు, ముక్కామల కృష్ణమూర్తి, శివాజీ గణేశన్, కృష్ణకుమారి మున్నగువారు నటిస్తున్నారు. తెలుగులో మాటలు, పాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రి ఇప్పటికి 7 వేల అడుగులదాకా తయారైందని తెలుస్తోంది. డిస్ట్రిబ్యూటర్లు పూర్ణావారు. ★

## రచయితలకు మనవి

**మీరు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్‌పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫోటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మీరు పంపిన రచనలను, ఫోటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.



సారథీవారి "అంతా మనవాళ్లే"లో సి. ఎస్. ఆర్., రంగారావు.

★

"చంద్రహారం" వర్కింగ్ స్టిల్ : చందనరాజు వేషంలో ఎన్. టి. రామారావు, రచయిత పింగళి, డైరక్టరు కామేశ్వరరావు, ఆర్ట్ కళాధర్, కామెరా బార్ట్లీ, చక్రపాణిగార్లను ఫోటోలో చూడవచ్చును.



గోకుల్ వారి "నిరుపేదలు"లో జమున, సురభి బాలసరస్వతి, రమణారెడ్డి.

★

యునైటెడ్ టెక్నీషియన్స్ ఎండ్ శ్యామలావారి "వ్రతఫలము"లో నిర్మల, పేకేటి శివరాం.

# తానొకటి తలిస్తే....

(11-వ పేజీ తరువాయి)

విద్యార్థి. ఆమెను గురించి అందరు విద్యార్థులలాగా అప్పుడప్పుడు నీచంగా మాట్లాడే వాడు. అలవాటు ప్రకారం బూతులుగూడ మాట్లాడేవాడు. అయినా, ఈ మాటలేవీ విశదీకరించలేని భావం మనసులో లేక పోలేదు. క్రికెట్ మైదానం దాటి అతని ఆలోచనలు అప్పుడప్పుడు అనసూయమీదకు పరిగెత్తేవి. రామకృష్ణ ఈ విషయంలో చాల తేడాగా వున్నాడు. ఆమెను గురించి అత నెప్పుడు నీచంగా మాట్లాడలేదు. ఆమె ప్రవర్తనని కూడ శంకించలేదు. ఆమెను గురించి నీచంగా మాట్లాడినప్పుడు కూడ, అతను విచారించలేదు. అయినా ఒక అందమైన యువతిగురించి అంత నీచంగా మాట్లాడటంలో అతనికేదో వింత తోచింది; విచారం వేసింది కూడ. ఆ తీరు మనుష్యుల్లాగ అతనుకూడ అందాన్ని చూసి బాధపడలేడు; నిగంగా మాట్లాడగు. కాని అప్పుడప్పుడు, చాల కొద్దిసార్లు—పుస్తకాల మధ్యలోనుంచి తలయెత్తి 'అనసూయ కూడ అందమైన యువతి' అని అతను తలపోశాడు.

అయితే వాళ్ళిద్దరు ఆమెను ప్రేమించారా? లేదని చెప్పాను. ఆమెను ప్రేమించటం అనేది వాళ్ళకు చాతకాదు. ఎందుకంటే, రాజుకు ఆ ప్రేమ అవసరంలేదు; రామకృష్ణకు అటువంటి ధైర్యంలేదు. కాని వాళ్ళిద్దరికి కూడ ఆమెలో, ఆమె కాకుండా, వాళ్ల హృదయాల్లో నీడల్లే మెలిగే అందాలరాసి, ప్రేమమయి కనిపించింది. రాజు ఆమెతో ఇంగ్లీషు సినిమాలకు వెళ్ళినట్లు, కాఫీహోటళ్ళకు వెళ్ళినట్లు కలలు గన్నాడు. ఆమెకు తనంటే గౌరవమున్నట్లు ఆలోచించాడు. రామకృష్ణ ఆమె తన "ప్రోటజీ" అయినట్లు, ఆమెకు

తాను అర్థంకాని విశేషాలు చెపుతున్నట్లు ఊహించేవాడు. ఈ భావాలు వాళ్ళే గుర్తించలేదు.

రోజులు గడిచిపోతున్నాయి. పైన చెప్పబడిన ముగ్గురు వ్యక్తులు వారివారి గోళాల్లో వారున్నారు. ఎవరిలోనూ మార్పు లేదు. ఏ క్రికెట్ మ్యాచ్ నాడో రాజు గంతులేస్తూ వుండేవాడు. ఏ కొత్తపుస్తకం కొన్నప్పుడో రామకృష్ణ సంతోషం వెలిబుచ్చేవాడు. ఏ కొత్తచీర కొన్నప్పుడో అనసూయ కులుకుతూ నడిచేది. అలాగే కాలం దొర్లిపోతుంది; కాని జీవితాల్లో పెద్దమార్పులు రావు. కాలేజీ కట్టివేసిన తరువాత వాళ్ళు విడిపోతారు; మరల కలుసుకోరు. కలిసివున్నప్పుడయినా ఒకరితో వకరికి సంబంధంలేకుండా గడిపారు. మనంకూడ జీవితకాలంలో, అనసూయవంటి అందగత్తెలను ఎందరు 'చూసివుంటాము; వాళ్ళతో పరిచయం ఏమీ వుండదు. అయినా తెలియని సంబంధం వుంటుంది. చివరికి ఏ వింతవిశేషం జరగకుండా విడిపోతాము.

ముగ్గురిలోను కొంచెం మార్పు కనిపించింది పరీక్షల్లోమాత్రమే. పరీక్షలు నెలరోజులున్నాయనగా, ప్రతి విద్యార్థిలోనూ అలజడి బయలుదేరింది. అంతవరకూ ఏమీ చదవని రాజుకూడ పాఠాలవైపు మనసు తిప్పాడు. పుస్తకాలకు బూజు దులిపి వేశాడు. సాయంత్రం క్రికెట్ ఆడటం మానేశాడు. అప్పుడప్పుడు రామకృష్ణ దగ్గర పాఠాలు నేర్చుకునే వాడు. క్రికెట్ నుంచి పరీక్ష చదువులకు మనస్సు తిప్పేసరికే పరీక్షలు మొదలుపెట్టారు. ఏమి అర్థం అవుతాయి పాఠాలు? ఎదురుగా వున్న పుస్తకాలని బిక్కమొహంతో రాజు చూస్తూవుంటే రామకృష్ణ ఏ దిగులూ లేకుండా పాఠాలు చదువుతున్నాడు. రాజుకు పుస్తకాలపై కలిగిన విసుగు రామకృష్ణ మీద ప్రసరించింది. రాజుకు విసుగు, కోపం త్వరగా వస్తాయి. రాజుకు రామకృష్ణమీద అకారణంగా కోపం కలిగింది. తను తెల్లమొహం వేస్తున్న సమయంలో, తన రూమ్ మేటు నిశ్చింతగా చదవటం అతని కోపాన్ని హెచ్చించింది.

పరీక్షలు మొదలుపెట్టారు. మొదటి రెండు పరీక్షల్లోనే తెలిశాయి రాజు ఫలితాలు. వ్రాయటానికి ఏమీతోచని రాజు, తలయెత్తటానికి తీరికలేకుండా వ్రాస్తున్న రామకృష్ణవైపు అక్కసు కక్కుకుంటూ చూచేవాడు. ఒక పరీక్షనాడు అరగంట అవగానే పేపరు ఇచ్చేసి వచ్చేస్తున్నాడు రాజు. ఎదురుగా కాగితాలమీద గీతలు గీస్తున్న అనసూయ, తలయెత్తి చూసి విస్తుపోయింది. అదే కాలేజీ పరీక్షలయినప్పుడు అతను చాల గర్వంగా "ఫీలు" అయ్యేవాడు; ట్వీడుపాంటు, తెల్లచొక్కా, గళ్ళ మేజోళ్ళు వేసికొని పరీక్ష హాలులోనుంచి త్వరగా వచ్చెయ్యటానికి గర్వపడేవాడు రాజు. అప్పుడు అనసూయ చూడటం సంభవిస్తే మరింత ఉబ్బిపోయేవాడు. కాని ఈరోజు సగం అయిపోయాడు, మనిషి. తనకేదో అన్యాయం జరిగినట్లు బాధపడ్డాడు. తరువాత చాలసేపటికి, దారిలో రామకృష్ణ చాల బాగ వ్రాశానని చెప్పటం, ఆ మాటలు ముందు వెళ్తున్న అనసూయ వినటం (వినివుంటుందనుకున్నాడు, రాజు) అతనికి మరింత కోపాన్ని పెంచాయి.

మనకు జన్మవిరోధు లనుకున్న వాళ్ళు అనూయకొద్దీ ఏర్పడతారు అనుకుంటాను. రాజుకు రామకృష్ణకు ఇంతవరకు ఏమీ సంబంధం వుండేది కాదు. రామకృష్ణ ఎప్పుడు క్రికెట్ ఆడలేదు. రామకృష్ణ రాజుకు సంబంధించిన ఏ విషయాలలోనూ జోక్యం కలగచేసికోలేదు. అందుకని వారిద్దరి మధ్య అనూయకు తావుండేది కాదు. కాని ఎప్పుడయితే రాజు ఆటలు మాని పాఠాలు మొదలుపెట్టాడో ఆ నిమిషమే ఇద్దరికీ సంబంధం కలిగింది. ఆ నిమిషమునుంచే ఈర్ష్య, అసూయ జన్మించాయి; అప్పటినుండే విరోధం కూడ. కాని, రామకృష్ణకు ఈ విరోధం సంగతి ఏమీ తెలియదు. రామకృష్ణే, చదువు మాని ఆటలలో ప్రవేశిస్తే రాజును చూచి కోపించి వుండేవాడు. అప్పుడు రాజుకు తెలిసివుండేది కాదు, తను రామకృష్ణ కోపానికి గురియైనట్లు. అలాగే యిప్పుడు రాజు అకారణ కోపానికి తను గురియైనట్లు రామకృష్ణకు తెలియదు. అతను మామూలుగానే మాట్లాడాడు రాజుతో.

ఆరోజు రాత్రి రాజు ఏమీ చదవలేక పోయాడు. అయినా చదవాలనే బాధ అతనిని వదలలేదు. అందుకని, రామకృష్ణని రాత్రి 1 గంటకు లేపమని చెప్పి నిద్రపోయాడు. చెప్పినట్లుగా రామకృష్ణ, రాజును లేపి తను నిద్రపోయాడు. రాజు మరల చదువుదామని ప్రయత్నించాడు; కాని అర్థంకాలేదు. ఒక్కసారిగా అనసూయ సంగతి జ్ఞాపకం వచ్చింది—తనని హాలులో చూడటం—రామకృష్ణ ఎలా వ్రాశాడో ఆమె వినటం—ఇవన్నీ. రాజు భరించలేకపోయాడు. అనుకోకుండా ఏదో వ్రాసి, కవరులోపెట్టి, పోస్టులో వేశాడు. ఆ వుత్తరం అనసూయకు రామకృష్ణ వ్రాసినట్లు వ్రాసిన ప్రేమలేఖ! సంతకం

మాత్రం తప్పులేకుండా చెప్టాడు !!

పోస్టులో వేసి రాగానే అమాయకంగా పడుకున్న రామకృష్ణ కనిపించాడు. రాజుకు విచారం కలిగింది. తను ఎందుకింత ఘోరమైన పాపం చేశాడు? పల్లెత్తు మాట అనని రామకృష్ణని ఎంగు కలా అవమానించాడు? వెంటనే లేచి నిజం చెబుదామనుకున్నాడు. చెపితే, తనకి నష్టం తప్పదు. రాజుకి ఏమిచెయ్యాలి తోచలేదు. ఒకసారి, అనసూయతో చెప్పి క్షమాపణ కోరదామనిపించింది. మరొకసారి వుత్తరం తనే వ్రాసినట్లు అందరిముందూ ఒప్పుకుందామనిపించింది. ఇంకొకసారి రామకృష్ణతో చెప్పి క్షమాపణ వేడుకో బుద్ధివేసింద. కాని రాజు ఇవేమీ చెయ్యాలేదు, అతనికి ఏమి చెయ్యాలో తోచలేదు కొబట్టి. పైగా, రామకృష్ణమీద కోపం పూర్తిగా నశించలేదు కూడ. కాని రామకృష్ణతో సరిగా మాట్లాడలేక పోయేవాడు.

మరొక రాత్రి గడిచింది. పరీక్షలు పూర్తిగా అయిపోయాయి. ఎవరింటికి వారు వెళ్ళటానికి సన్నాహాలు చేస్తున్నారు. రామకృష్ణ సామాను సర్దటంలేదు. అతనింకొక రోజు ఆ వూరులోనే వుంటాడట. రాజుమాత్రం సామాను సర్దుతున్నాడు. ఇంకొక రెండుగంటలలో బండి. ఆ కాలం కాస్తా వెళ్ళిపోతే రామకృష్ణసంగతిగురించి తను ఇంక బాధపడక్కరలేదు. జరిగేదేదో జరుగుతుంది. తనుమాత్రం ఆ సీను చూడడు కదా! ఇంతలో గది గుమ్మం చీకటయింది. ఇద్దరూ తలయెత్తి చూశారు. వచ్చిన వ్యక్తి ఎవరో రాజుకు తెలుసు, రామకృష్ణకు తెలియకపోయినా. రాజు ఆశ్చర్యంగా చూశాడు; రామకృష్ణ ఆగంతుకుని మర్యాదతో ఆహ్వానించాడు:

"మీ పేరేగద్యూ రామకృష్ణ?" అన్నాడు అతను.

"కాని మియ్మల్ని చూసినట్లు జ్ఞాపకం లేదు. నాకు మరుపు"...... రామకృష్ణ పూర్తిగా మాట్లాడక మునుపే ఆ బలమైన మనిషి ఇలా అన్నాడు:

"నేను అనసూయ అన్నయ్యను. మీరు వ్రాసిన వుత్తరం మా యింట్లో అందరమూ చదివాము. ఈ విషయం మాకు అందరికీ పూర్తిగా ఇష్టం. అనసూయకూడా చాల.."

రామకృష్ణకి తాడూ బొంగరమూ అనలేదు. ఏదో వండర్‌లాండ్‌లో వున్నట్లుంది.

కాని, సామాను సర్దుతున్న రాజుకు ఒక్కసారి పెద్దపెట్టున అరవాలనిపించింది. తనకి తీరని అన్యాయం జరిగినట్లు ఏడవాలనిపించింది! ★

# ★ అద్దంమీద ఆవగింజ ★

(38 వ పేజీ తరువాయి)

ఎక్కువ కాలేదు. మీ నాలుక బహుశా పూర్తిగా ఉప్పెక్కిపోయి వుంటుంది. నాకు చేతనయినట్లు నేను వండుతున్నాను. అంతకంటే బాగా వండటం నాకు చేతగాదు.”

“‘కాఫీ’లో పంచదార రోజు మాదిరిగానే వేశాను. తమరు కాఫీలో పంచదార హఠాత్తుగా తగ్గించేసినట్లు నాకేమీ టెలిగ్రామ్ రాలేదు.”

“మీ కెప్పుడో జీతం వచ్చాక, ‘ఫేస్ పౌడర్’ తెస్తానంటే కుదరదు. వెంటనే తేవాలి.”

“చీరెకు నాదగ్గర డబ్బు లే’ దంటే నేనేమీ ఒప్పుకోను. అప్పు చేసి అయినా డబ్బు తెచ్చి యివ్వాలి. మీరు వెంటనే చీరెకు డబ్బు యివ్వకపోతే, నేను మా పుట్టింటికి వెళ్ళిపోవాల్సివుంటుంది.”

సాయంత్రం ఆఫీసునుంచి రాగానే భార్య వ్రాసిన చీటీని చదువుకున్నాడు మోహనరావు. చీరెనెపంతో పుట్టింటికి వెళ్ళిపోతానని బెదిరిస్తుందా?... బెదిరించనీ! అదెంతవరకు సాగుతుందో చూద్దాం! పళ్ళు పటపటా కొరుక్కున్నాడు మోహనరావు.

ఆ రాత్రినుంచే హోటల్లో భోజనం చేయటం మొదలెట్టాడు. రెండు మూడు రోజులు వేచివుంది శారద, చీర తెచ్చి రాజీకి వస్తాడేమోనని. చీరె తేనూ లేదు: ఇంట్లో భోజనంచేయనూ చేయటం లేదు. పుట్టింటికి వెళ్తున్నట్లుగా ఒక చీటీ వ్రాసి, అక్కడ పెట్టి పుట్టింటికి వెళ్ళిపోయింది.

* * *

శారద యింటికి రాగానే ‘ఒక్కదానివే వచ్చావేమే?’ అని తల్లి అడిగింది. ‘మీ అల్లుడుగారికి ఆఫీసు పని వత్తిడిగా వుందిట. రావటానికి వీలుపడలేదు’ అని ముక్తసరిగా సమాధానం చెప్పింది శారద. ఇంత స్వల్ప విషయంమీద భర్తతో పోట్లాడి యిక్కడకు వచ్చానని ఎట్లా చెప్పకుంటుంది మరి! ఎటు తిరిగీ భర్త, తనకోసం పది పదిహేను రోజులు గడిచాక రాకపోతారా అని ఆవిడ ధీమా.

వచ్చినదగ్గరనుంచి తమ్ముడు చెల్లాయిలతో కబుర్లు చెపుతూ రోజులు గడిపేస్తోంది. కానీ హఠాత్తుగా ఒకరోజున దిగులు పుట్టకొచ్చింది. నెల రోజులయినా ఆయన రాకపోగా, ఉత్తరం ముక్కయినా వ్రాయలేదు. ఇట్లా ఎన్నాళ్ళు? పంతాలకుపోయి పండంటి కాపురం బగ్గిపాలు చేసుకోవటం అవుతుందేమోనని భయంవేసిపోయింది శారదకి.

ఐనా, తన పిచ్చిగాని, భర్త తనని మొదటినుంచీ ఎంత ప్రేమగా చూడలేదూ? తను అడిగిందే తడవుగా ఎన్ని వస్తువులో తెస్తుండేవారు కాదూ? తియ్యతియ్యగా కబుర్లు చెప్పకొంటూ హాయిగా కాలం గడిచిపోతుండేది. ఏదో, తను కోరిన విదేశీ సోప్ తేలేదనుకో? తను వెంటనే ప్రతీకారం చేయాలా? తనకు విదేశీ సబ్బే కావాలని తిరిగి అడిగితే తెచ్చేవారు కాదూ? ఛీ! తను ఎంత పాపిష్టిది - శారద ఈవిధంగా పరిపరితెరగుల మధనపడింది. పెండ్లి కాని కన్యలాగా యిలా పుట్టింట్లో ఏకాంతంగా రోజులు గడపటం అసహ్యం వేసిపోయింది. ఏమైనా సరే - యిక్కడనుంచి వెళ్ళిపోవాలనుకున్నది.

ఆ ఉదయాన్నే ప్రయాణమై తల్లిదగ్గరకు వచ్చింది శారద.

“అల్లుడు వచ్చి తీసి కెళ్తాడని

# ఘంటారావం

(14-వ పేజీ తరువాయి)

"ప్రేమలేదా!" అందామె. భయపడుతూ భయపడుతూ అతన్ని సమీపించి, అతని రెండుచేతులూ పట్టుకుని బల్లపైన కూర్చోబెట్టింది. "ఫీబస్! ఎంతమాటన్నారు? పోనివ్వండి; నాకిప్పుడు తల్లితో పనేమిటి? నాకు మీరే తల్లీ తండ్రీ అనుకుంటాను. ఫీబస్! నావంక చూడండి. నేను నా సర్వస్వం మీ కర్పిస్తాను. నా ప్రాణాలు, నా మానం మీ అధీనం. మీకు నన్ను పెళ్ళిచేసుకోడం ఇష్టంలేకపోతే, మీదగ్గర బానిసగానే ఉంటాను. మాకు జిప్సీలకి ప్రేమకీ, స్వేచ్ఛకీ మించిన వేవీలేవు" ఇలా అంటూ ఆమె అతని భుజాలపై చేతులుంచింది. నీరు నిండి తొణికిసలాడుతున్న కన్నులతో, చిరునవ్వుతో అతని నాహ్వానించింది. అతడు పట్టరాని ఉద్రేకంతో ఆమెను గాఢ పరిష్వంగంలో బంధించివేశాడు.

అకస్మాత్తుగా ప్రియుని శిరస్సుకు పైన మరొక ముఖం ఆమె కంటబడింది. ఆ ముఖం అతి వికృతంగా భయంకరంగా కనపడింది. తళుక్కున కత్తి మెరిసింది.

క్లాడ్ ఫ్రాలో ఆవేశం అణుచుకోలేక కొయ్యతలుపులు ఎత్తి తీసివేశాడు. తీసి నిశ్శబ్దంగా వచ్చి వారిద్దరివెనుకా నిలబడ్డాడు. యువతి నోటివెంట మాటరాలేదు. గొంతెత్తి అరవాలనుకుంది; కాని ఆమెకు సాధ్యంకాలేదు. కత్తి యువకుని శిరస్సుపై పడింది. క్లాడ్ బలంగా కొట్టాడు. కెప్టెన్ ఒక్కసారి అరిచి కూలిపోయాడు. ఎస్మరాల్డా స్మృతితప్పి పడిపోయింది. స్మృతి తప్పిపోతున్న సమయంలో తన పెదవులపై నిప్పులా కాలిపోతున్న పెదవులు చుంబించడం మాత్రం ఆమెకు తెలుసు.

ఆతరువాత ఆమెకు స్పృహ రాగానే చుట్టూ సిపాయిలు మూగిఉన్నారు. క్లాడ్ లేడు. నదివైపు కిటికీ తలుపులు తెరిచి ఉన్నాయి. రక్తం దారివెంట కారుతూండగా ఫీబస్‌ని సిపాయిలు మోసుకుపోతున్నారు.

"మాయలమారి! కెప్టెన్ ఫీబస్‌ని మాయచేసి తీసుకొచ్చి కత్తితో పొడిచేసింది" అంటున్నారు సిపాయిలు.

(ఇంకా వుంది)

---

"చెప్పితీసికెళ్ళలేదే?" అని అడిగింది తల్లి. శారదగుండె గతుక్కుమంది — తను పోట్లాడి వచ్చినట్లుగా తల్లి ఎక్కడ పసికడుతుందోనని.

"వారికి ఆఫీసు పనుండి రావటానికి వీలుపడలేదు కాబోలు. నేను వెళ్ళి తీరాలి" అన్నది శారద, తనేదో ఒక దృఢ నిర్ణయానికి వచ్చినట్లుగా.

మరేమీ చెయ్యలేక, తల్లి 'సరే' నని వూరుకుంది. తన భర్తకు ఇష్టమైన పిండివంటలు కొన్ని తల్లి చేత చేయించుకొని, తమ్ముణ్ణి తోడు తీసుకొని ఆ ఉదయాన్నే రైలు ఎక్కేసింది శారద.

* * *

రైలుస్టేషన్ చేరుకొనేటప్పటికి మధ్యాహ్నం 12 గంటలయింది. శారద రైలు దిగింది. ప్లాట్‌ఫారం అంతా జనంతో కిటకిట లాడిపోతున్నది. ప్లాట్‌ఫారం మీద పది గజాల దూరంలో భర్త కనుపించాడు. శారదకు పంచప్రాణాలు లేచివచ్చినట్లయినాయి. భర్త ఎవరికోసమో వెతుకుతున్నట్లు రైలంతా చూస్తూ వున్నాడు. చేతిలో కాగితపుపొట్లాం ఒకటిమాత్రం వుంది. శారద చేరువకు రాగానే మోహనరావు ఆమెకేసి చూశాడు.

"శారదా......!" అన్నాడు మోహనరావు అప్రయత్నంగా. శారద సిగ్గుతో తల వంచుకుంది.

"ఎప్పుడు బయలుదేరావు?" అన్నాడు మోహనరావు, ఇంకే విధంగా పలకరించాలో తెలియక.

"ప్రొద్దునే బయలుదేరాను" అన్నది శారద సన్నగా, పరాజయం తనదేనని ఒప్పుకొంటున్నట్లుగా.

"ఈ ఒంటిగంట బండిలో వచ్చి నిన్ను తీసికొద్దామని, స్టేషనుకి వచ్చాను. దైవికంగా నీవే కనుపించావు!" అన్నాడు మోహనరావు, 'ఓటమి నీ వొక్కదానిదే కాదు, యిద్దరిదీ' నని ధ్వనించేటట్లుగా.

అందరూ స్టేషన్ బయటకువచ్చి, ఒక గుర్రపు బండిలో యింటికి చేరారు. ఇంటికి రాగానే, తను చేయించుకొచ్చిన రకరకాల పిండి వంటలు, ఒక ప్లేట్‌లో పెట్టి భర్త ముందు పెట్టింది. మోహనరావు వాటిని ఆప్యాయంగా తింటూ, చేతిలోని పొట్లము శారదమీదికి విసిరేశాడు. శారద పైకాగితాన్ని చించి చూసుకొంది: తను కోరిన కొత్తరకం పట్టుచీరె! ఆమె హృదయం ఉప్పొంగిపోయింది. శారద తమ్ముడికి యిదంతా ఏమీ అర్థం కాకపోయినా ఎందుకో వూరికే నవ్వేస్తున్నాడు. ★

# జల్సా పురుషుడు

(25-వ పేజీ తరువాయి)

పక్కనుకుని పడుకుని నిద్రా, మగతా లేని స్థితిలో వున్నాడు. రామలింగేశ్వరరావుకి థియరీ బుర్రకెక్కటంలేదు. తన దొంగతనం గోవర్ధనానికి తెలిసిపోయిందేమో! ఎదురుగుండా అతన్ని గూర్చి రామలింగేశ్వరరావు చదువు సాగటంలేదు. వీడు సినిమాకన్నా పోడూ ఏంటా! ఈ రూంలోకి ఇద్దరూ ప్రవేశించాక, ఇదే వాడు సినిమాకి వెళ్ళని మొదటిరాత్రి, సినిమా గురించి వాగని మొదటి రోజూను. రామలింగేశ్వరరావుకి వుండబట్టలేదు. కుంపటిమీద కూర్చున్నట్టు వుంది. తనంత మంచివాడు లేడని కాలేజీ లెక్చరర్ల అభిప్రాయం. అదే అభిప్రాయం గోవర్ధనానికి వున్నది. అది కాస్తా ఈరోజున ఎగిరిపోతుందా ఏం? కాని రుజువేమీ లేదు. గోవర్ధనానికి తన మీద నేరం మోపటానికి... ఈ ఆలోచనతో, జలగా గోవర్ధనంమీద రామలింగేశ్వరరావుకు కోపమూ వచ్చింది. అంత జల్సాగా వుండటం మెందుకు, వాటికి కాస్త అవాంతరం వొచ్చేసరికి ఇట్లా బేజారైపోవటం ఎందుకు? ఇట్లాంటివాళ్ళే, తను ఆ పది ఇవ్వమని అడిగితే ఇచ్చేవాడేనా? చస్తే ఇవ్వడు; వాడికేం తను చదవకపోతే?

గోవర్ధనం, రెండుమూడుమార్లు అటూ ఇటూ దొర్లి పడుకున్నాడు. బయట వాన కురుస్తోంది. వెల్తురు మసకబడిపోయింది. రామలింగేశ్వరరావు లేచి, ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కి, మళ్ళీ పుస్తకం ముందేసుకు కూచున్నాడు.

బయట, సైకిల్ బెల్ మోగింది. అది పోసుమెన్ సైకిల్ అని ఆ ప్రత్యేకమైన శబ్దం ద్వారా గుర్తించిన ఇద్దరు మిత్రులూ ఆదుర్దాగా పరిగెత్తారు బయటికి. టెలిగ్రాం వొచ్చింది గోవర్ధనానికి. అతడు లోపలికి ఒక్క పరుగున వొచ్చి పక్కమీదపడి దొర్లుతూ ఏడవసాగాడు. రామలింగేశ్వరరావుకి ఏమీ తోచలేదు. "గోవర్ధనం! ఏమిటది? నాతో చెప్పు! ఆ టెలిగ్రాం ఏది - నన్ను చూడనీ!" అని వోదారుస్తూ, గోవర్ధనాన్ని లేపి కూచోపెట్టాడు.

గోవర్ధనం టెలిగ్రాం కాయితం రామలింగేశ్వరరావుకి ఇవ్వలేదు. అతడి మొహం, ఆ ఐదు నిమిషాల్లో మరింత పాలిపోయి, పదేళ్ళ వయసు పెరిగినవాడల్లే తయారైంది.

అతని కోటంబడి మాట రావటానికి ఇంకో ఐదు నిమిషాలు పట్టింది. "ఆ పది రూపాయలూ పోకుండా ఉన్నట్టయితే!"

రామలింగేశ్వరరావు గుండె ఝల్లుమన్నది. దానికీ దీనికీ ఏమిటి సంబంధం?.. "ఏమిటి గోవర్ధనం? సరిగ్గా చెప్పు! విచారపడకు!" అనగలిగాడు.

గోవర్ధనం, విరక్తిగానూ, చిరాగ్గానూ లేని నవ్వు నవ్వి, "అవును. ఆ పది పంపించేసి వుంటే.. నిన్ననే ఆ పది వొచ్చివుంటే..." అంటూ రామలింగేశ్వరరావుకేసి తీవ్రంగా చూస్తూ, "నీకు డబ్బు విలువ బాగా తెలుసుగదూ!" అన్నాడు.

రామలింగానికి క్షణం ఒక యుగంగా వున్నది. "ఊఁ" అన్నాడు నీరసంగా.

"ఆ పది రూపాయల కోసం నేను, 6 రోజులు పని చెయ్యాల్సి" అన్నాడు గోవర్ధనం, చొక్కా లేని తన అస్థిపంజరపు శరీరంవంక చూస్తూ.

"ఏమిటది?" రామలింగేశ్వరరావుకి ఏమీ అర్థం కావటంలేదు అయినా, అతడు మెల్లగా, "డబ్బు విలువతో నీకేం పని వొచ్చింది? జల్సాగా..."

గోవర్ధనం పూర్తిగా రెచ్చిపోయాడు. "అదే నీ వుద్దేశం. నేను, రోజూ సినిమాల కెళ్తున్నాననీ, నా డబ్బు మంచినీళ్ళల్లే వ్యయమౌతున్నదనీను! అట్లా కనిపిస్తే కాని, ఈ వాతావరణంలో బతకటం దుర్భరం! నేను ఆ పదిరూపాయలు దేనికోసం ఉంచానో తెలుసా?"

"తెలీదు. బహుశా, సాదరు ఖర్చుకోసం వుంచుంటావు!" అన్నాడు మిత్రుడు.

"సాదరు! అంతకన్న వాడుకున్న అనవసరాలు వేరేవుంటాయని నీకు తోచదు!" గోవర్ధనం అరిచాడు. "నా నేస్తాలు ముందు నీసా కొవటానికోసం వుంచాను అది...

ప్రతిరాత్రి ఆ విశాలా ప్రెస్‌లో నీలర్ పని చేసి, గడిస్తున్న సంపాయించి నా ఖర్చులు జరుపుకుంటూ అమ్మకెప్పుడూ పంపించాలి. ఆమె వంటచేసి సంపాయించేది, చాలదు! నా ఖర్చు విలువయినంత తగ్గించాను పొద్దున ఒక్క కాఫీ— మధ్యాహ్నం భోజనం—నెలకు 15 రూ॥ రాత్రి ఒక "టీ" నెలసరికి 4 సార్లు ఇస్త్రీ గుడ్డలకు 2 రూ॥ లు. క్షవరానికి శ్రేష్ఠ రూపాయి-- డబ్బు లేకపోయినా డాబు సరిగా కనపడుతూ, ఇంకెవర్నీ ఏమీ అడగకుండా,.." గోవర్ధనం ఇంకా పూర్తి చెయ్యలేదు.

గోవర్ధనం కళ్ళవెంట నీటిచుక్కలు రాలినై. "చెల్లెలు చనిపోయింది. మందు అందలేదు. లివర్ ప్రబ్లైసదని డాక్టరు చెప్పారు." ★

# ★ కాలక్షేపం ★

(4-వ పేజీ తరువాయి)

లోని షరాబును పరిపరివిధాల బతిమాలినాడు. కాని, అతను రూల్సు ప్రకారం వీలు లేదన్నాడు. కాని రంగారెడ్డి బ్యాంకులో పెద్ద ఖాతాదారు. నాటి సాహుకార్లందరూ, ఆఖరు క్షణంలో వచ్చిన ఆసాములందరూ, హాయిగా పైకం జమకట్టుకొని దాచుకొని పని పూర్తిచేసుకొని కూర్చుండడం చూస్తే కడుపుమండడం ప్రారంభించింది రంగారెడ్డికి. సరాసరి సాగ్రహ గ్రేసరభాసమానుడై షరాబుపై అధికారియైన బ్యాంకు ఏజంటువద్దకు వెళ్ళాడు. ఆయనను తన మాటల ధాటితో మెప్పించి,ఒప్పించి,షరాబువద్దకు రప్పించి షరాబుకు చెప్పించి, తన పదివేల పైకమును మరూనట లేదీతో తన ఖాతాలో జమ కట్టం చెడి కట్టుదిట్టము చేసి, ఆ లెక్కల రశీదును మాత్రము బ్యాంకు ఏజంటువద్దనుంచి తీసికొని, నాటి సాహుకార్లమీదసవాలు చేసి, "చూచుకోండి! నా సత్తా! సైపుచ్చుకొన్నాడా లేదా? మీరందరూ పది వేలు జమ కట్టించి కూర్చుంటే మీకు రశీదును ఈ జీని కొనకున్నారా? దేనికైనా రంగారెడ్డి అంటే బెంగ పెట్టుకోని కూర్చుండేవాడు కాదు" అని ప్రకటించాడు. గగ్గోలు గావుంది. "అర్బత్ నాట్ బ్యాంకు దివాలా!" అని ఊరంతా ఒకటే హోరుగా ఉంది. ఇంకేముంది! అర్బత్ నాట్ దివాలా! రంగారెడ్డి దివాలా! అతని గతిలోడి వదనం— నిర్ఘాంతపోయిన వదనం. బ్యాంకు సింహద్వారంవద్ద నిలువబడ్డాడు. కాని బ్యాంకు తలుపులు బంధించి ఉన్నాయి.

అతని తలపులు పరుగెత్తుతున్నాయి. ధైర్యము విలోలంబయ్యె - మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్—గజేంద్రునివంటి, మత్తమాతంగమువంటి రంగారెడ్డి స్వగ్రామానికి స్వజన సహాయంతో చేరాడు. రంగారెడ్డికి పోయింది లక్షకు పైగా. కాని లేనివాడు కాదు యిప్పటికైనా - అయితే ఏం? అతనికి దిగులు మిగిలింది ఆ దిగులు పగలూ రాత్రీ వడ్డీ పెరిగినట్టుగా పెరిగింది. ఆస్తి బాధ అప్పుబాధకంటె అధికమై అతనినే ఆఖరుకు "స్వాహా!" అంది.

ధనంకోసం తపస్సు చేయవచ్చు, కృషి చేయవచ్చు. కాని, ధనకాంక్ష తన్ను తపింపజేసి దహింపచేసినప్పుడు, దీన వదనంతో ఉన్నవాడు ధైర్యహీనుడై లేని వాడవుతాడు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras